# RUKMINI KALYANAM.

( A Telugu Drama in 6 Acts.)



BY

Vidwan D. RAMAMURTY SASTRY.

శ్రీ

# రుక్మిణీ కల్యాణము.

[ఆఱంకముల తెలుఁగు నాటకము]

కర్త:

విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రి

శ్రీ విజయనగర మహారాజ సంస్కృత
కళాశాలాంధ్ర పండితులు.

REVISED EDITION 1934

విజయనగరము.

All rights Reserved.] [సర్వస్వామ్యసంకలితము.

# తొలి పలుకు.

విద్వద్వర్యులారా ! ఆంధ్రభాషాభిమానులారా !

తొల్లుదొల్త సర్వేశ్వరకల్యాణగుణ ప్రతిపాదకంబగు నొక కృతి నొనర్చిన నస్మత్కవితాలత యుత్తరోత్తరాభివృద్ధిం గాంచునను నచ్ఛఘనచ్ఛికతోడ శ్రీవిజయనగర మహారాజ సంస్కృతకళాశాల లో విద్వద్ద్వితీయకక్ష్యయందు విద్యాభ్యాసముసేయుతఱి నే నీచిన్ని నాటకమును రచించితిని. నేను గ్రామాంతరమునసుండు నదనున దీని ప్రథమముద్రణము జరుగుటచేతను, నాకే సర్వస్వామ్యము నొసంగుచు నాఁడు మహాకాళీముద్రణాలయాధిపతు లుచితముగ దీని నచ్చొత్తించినకారణముసఁ దగిన శ్రద్ధగైకొనకుండుటచేతను, తొలి కూర్పు దోషభూయిష్ఠమై నాజ్ఞానమునకును గొంతగల్గించినది. దాన నా ప్రతులనెల్లను రద్దుపఱచి యలంతిమార్పులఁ గూర్పులఁ గావించి దీనిని మరల ముద్రింపించితిని. సుశీలురగు నాంధ్రపండితసోదరు లిందలి నెరసుల లెక్కింపక గుణములనే గైకొని నన్ను బ్రోత్సహింపఁ బ్రార్థించువాఁడను. కథాభాగము ప్రసిద్ధమగుట వేఱుగా నిందు నిరూపితముగా లేదు.

ఆంధ్రవిశ్వవిద్యాలయమువా రుభయభాషా భాషాప్రవీణ మధ్యమపరీక్షకు దీనిని బార్యముగానిర్ణయించి నన్నుఁబ్రోత్సహించి నందుల కేను వారికెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఇట్లు విన్నవించు సుజనవిధేయుఁడు,

శ్రీమహారాజ సంస్కృతకళాశాల,
విజయనగరము.
జూలై 1934.

విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రి
ఆంగ్లోపాధ్యాయుఁడు.

# ఇందలి ప్రధాన పాత్రలు.

| పురుషులు. | స్త్రీలు. |
| --- | --- |
| 1. శ్రీకృష్ణుఁడు. | 1. రుక్మిణి. |
| 2. భీష్మకుఁడు. | 2. సతి. |
| 3. రుక్మి. | 3. కల్యాణి. |
| 4. సుదర్శనుఁడు. | 4. అరవింద. |
| 5. లలితుఁడు. | |
| 6. శిశుపాలుఁడు. | |



శ్రీరస్తు.

# రుక్మిణీ కల్యాణము.

## ప్రథమాంకము.

నాంది.

శా. శ్రీకల్యాణకరుండు భక్తవశుఁడు ♦ ర్వీరక్షణాసక్తుఁడ
స్తోకప్రాభవుఁ డవ్యయుండు నిగమ ♦ స్తోమాభివేద్యుండు స
ల్లోకారాధ్యుఁడు దుష్టశిక్షకుఁడు ను ♦ శ్లోకుండు నౌ రుక్మిణీ
శ్రీకాంతాపతి ప్రోవుత మిమ్ము జయ ♦ శ్రీలఁ బ్రసాదించుచున్.

బాహ్యోద్యానము.

[రుక్మిణి యిర్వురు చెలికత్తెలతోడ సంచరించుచుండును]

రుక్మిణి:—అరవిందా! ఆమనిసమయ మెంతమనోహరము! అందును నీ సాయంసమయ మత్యంత మనోజ్ఞము. ఈ లతా పాదపములకెల్లను వసంతశ్రీసమాగమముననేగదా యిట్టియపూర్వ రామణీయకము సంభవించెను. ఈ ప్రభంజనున కిట్టి యభూతపూర్వంబగు ప్రశాంతగతియు, సౌరభమును, జిల్లంపినమును, వసంతలక్ష్మీసంగతినేగదా సమకూరినవి.

అర:—ముగ్ధా! సర్వమును సంగతిమూలముననే మనోహరమగును. చూడుము.

సీ. సౌనఁ దీరియు బ్రహ్మ ♦ జాతి వజ్రముఁ దున్న
బంగారుచెల్మినే ♦ రంగుమీఱు
మించురిక్కల గుమి ♦ మించియు గగనంబు
చంద్రసంగతిచేన ♦ జానుమీఱు
నిర్మలోదకమున ♦ నిండియుఁ గోనేరు
జలజాశ్రియమునసే ♦ సౌరు మీఱు
బాగుమీఱియుఁ గాంత ♦ ప్రియంపు మైత్రినే
భూతపూర్వముగాని ♦ పొల్పుమీఱు
తే. గీ. దినకరుని ప్రభునసె భువి ♦ తెలివిమీఱు
మెఱుఁగుచేరిమినే మొగు ♦ ల్మెఱుఁగుమీఱు
తావికూర్మినె కుసుమము ♦ తళుకుమీఱు
కాంత కాంతుని చెల్మినే ♦ కాంతిమీఱు.

చెలీ! మఱియు నా దెసం దిలకింపుము.

తే. గీ. మలయమారుత మొలయంగఁ ♦ గలఁగుచెంతో
కోరకితగాత్రితో తీవ ♦ కోమలులును
బల్లవశిఖామణులు బిగ్గఁ ♦ బట్టుకతనఁ
గలుగు నన్యోన్యశోభను ♦ గంటివె చెలి!.
తే. గీ. నిండుకొని గండు తుమ్మెద ♦ పిండు నిండు
తమిని శ్రీ పుష్పసేవకుఁ ♦ దత్తరపడఁ
గదలుఁ గొమ్మలచేతులఁ ♦ గడు నదల్చు
మాధవీ మాలతులఁ గాంచు ♦ మా వధూటి.

చెలీ! సర్వ మానందజలధి నోలలాడు నిట్టిసమయమున నేతాదృశ మనోజ్ఞప్రకృతిదృశ్యమును గనియు నానందింపక మోము ముడిచికొనియుండుటకుఁ గత మేమి? నీవు కొన్నినాళ్లనుండి వికాస మేది యన్యాధీనమానసవు బలె ను డ నిమిత్త మేమి?

రు:— చెలీ! ఏమి తెల్పుదు! మూఁడురోజుల క్రిందటఁ వేఁగుబోఁక నొక వింత కలం గాంచితిని.

అరః—ఏమో కలలెఱుంగు.

రుః—ఒంటిగ భవానీపూజకై ఫలపుష్పాదుల నిండిన పళ్లెరముం
జేతఁబట్టి పోవుచుంటినఁట. దారిలో,

సీ. నీలమేఘముడాలు ♦ డీలుసేయఁగఁజాలు
నెమ్మేనితళుకున ♦ నెగడువాఁడు
కోదమతుమ్మెదగమి ♦ నదలించు కాకప
క్షంబుల యుత్తమాం♦గంబువాఁడు
క్రొక్కాఱుమెఱుఁగును ♦ నెక్కసక్కెములాడు
లలితహా కనక చే♦లంబువాఁడు
ఇంద్రచాపముసౌరు ♦ క్రిందుసేయఁగఁజాలు
శిరసున నెమ్మిపిం♦ఛియమువాఁడు

తే. గీ. తగఁ ద్రిభంగిగ నిల్చి పెం♦దవులఁ బిల్లఁ
గ్రోవి నిడి ఊలుకఱుఁగంగ ♦ గోవులెల్ల
మైమఱచి నిల్వఁ బోడు చ♦మందగతిని
గాంచి ననుజేరి యిట్లనె కరము రక్తి.

అరః—చెలీ! ఏమనెను?

(రుక్మిణి లజ్జాతిశయమును సూచించుచు)

మ. పొలతీ పూర్వభవానుబంధ మదియే♦మోగాని దేవేరిగా
వలచున్ నిన్ననురక్తి నామది, తలం♦పన్రాదు నీచిత్త మిం
దులకై వేగుదు, రుక్మి నీయకొలుపన్ ♦ దుస్సాధ మేమందు విం
తుల చిత్తంబును బూరుషుండెఱిఁగి యు♦ద్యోగించు టర్హంబుగా.

అన నే నధోముఖినై నిల్చియుంటినఁట.

అంత.

మ. అతివా! మౌనము సమ్మతిం దెలిపెనం♦చాత్మీయవామాంకమం
దతను ప్రేమను నన్ను నిల్పి కురులన్ ♦ హస్తంబుచే దిద్దుచా

నతహా మన్మథు మెత్తి ముద్దిడి యిక • జ్జాగేల రమ్మంచు స
మ్మతి నంశ్లేష మొనర్చి తేరున నిజా•న్మాన్యుండు నన్నంతలో.

అర:—ఏమయ్యెను?

రు:—తే.గీ క్రమ్మె శాత్రవసేన పో•రాట మమరె
నుఱుక యవ్వీరుఁ డద్దాని • తఱిమి తమిని
విజయశంఖంబు పూరించి • వేగ నాదు
చెంతఁ గూర్చుండి తనయిల్లు•చేర్చె నన్ను.

కల శుభప్రదమా కాదా యని నాఁటినుండి విచారించుచున్న దానను.

అర:—ఆ విగ్రహ మెవ్వరిదనియా! అతనుప్రేమప్రకారమును భావించికొనియా విచారించుచుంటివి.

రు:—నాకది వింతగఁ దోఁచుటంజేసి విచారించుదానను.

అర:—వింతయేమి? మఱుఁగుపఱుపఁ నెఱుఁగనట్లు నటించుచున్న దానవుగాని యది యదుసింహుని రూపుగాదా! ఇందువదనా! డెందంబునఁ జిన్ననాఁటినుండి యా జగన్మోహనుని రూపునే ధ్యానించుదానవుగాన భావనాబలమున నదే స్వప్నమందును సాక్షాత్కరించెను. నీ మనోరథ మచిరకాలములో సఫల మగు. ఊరడిలుము.

రు:—చెలీ!

మ.కలయోమాయయొపైత్యదోషమొయెఱుంగంజాలనాశ్చర్యమో
చెలియా యెన్నఁడెఱుంగనట్టి వికృతిం • జెందెన్మనం బక్కటా
తెలియన్లేనదియేమొ వేదనయు నెం•తేఁ గల్గె నంగంబులన్
పొలిచెన్వేఁడిమినాఁటినుండియది స•మ్మోహాస్త్ర మోస్వప్నమో.

అర:—సఖీ! ఇంతటినేర్పుగలదానవని యింతవఱ కేనెఱుంగను. ఆజగన్మోహనాకృతి నన్ను సమ్మోహితంజేసి మన్మథునలుఁగులకు గుఱిసేసి సిలుగులంబెట్టుచున్నదనక యెంతనిపుణముగఁ దెల్పితివి.

కల్యాణి:—అరవిందా! అట్లనకుము. మోహమున నీ ముగ్ధ యేమెఱుంగును?

రు:—అరవిందా! నీవేమన్నను సరే! ఆగోపాలుఁడు మోహనమూర్తి యని వినికిగాని యేనెన్నఁడుఁ జూచియుండలేదు. ఆ భగవానుని నచ్చికతో దైవముగ నెంచి పసితనమునుండి యారాధించుదాననుగాని యన్యమెఱుంగను.

అర:—మనోదైవముగ నమ్మి యారాధించుదానననుము.

క:—చెలీ! కల శుభప్రదము. శీఘ్రము నీదైవము సాక్షాత్కరించి నిను ధన్యం జేయఁగలఁడు.

(రుక్మిణి యొకవలను గాంచి హఠాత్తుగ నిల్చిపోవును.)

అర:—తే.గీ. వెఱ్ఱిదీరెను ఱోకలి ♦ బుఱ్ఱచుట్టుఁ
జుట్టుమన్నటులున్నది ♦ యిట్టులేల
నిలచిపోతివి బెదరుచుఁ ♦ జెలియ! యేమి
కంటఁబడె? రమ్ము వేగ మా ♦ వెంట నింక.

క:—ఉపవనమిది. ఇందు నదరుబెదరులు గొన నవసరమేమి?

రు:—పరపురుషసంచారముగల యీ యుపవనమునకు ననుఁ దోడి తేర మీకు న్యాయమా! నాన్నగారు విన్న నన్ను గోపపడకుందురా? చాలు. పోదము రండు.

అర:—పురుషు లెక్కడనే. నీకనులకంతయుఁ బురుషమయముగ నగపడుచున్నది గాఁబోలు. మోహవిభ్రాంతి యట్లు నినుఁ జేయుచున్నది.

రు:—కల్యాణీ! ఆపైపునకుఁ జూడుము.

తే.గీ. చెలియ! చెలికానిబుజముపైఁ ♦ జేయివైచి
నవ్వుచా మావిక్రింద నుఁ ♦ న్నాఁడెవండొ
మాధవునిగూడి విహరించు ♦ మన్మథుండొ
రాణ నరుఁగూడి తిరుగు నా ♦ రాయణుండొ.

అర:—(అవలనుగాంచి)కలలోఁగాంచిననీమనోదైవమే సాక్షాత్కరించె. దర్శనముచేసి ధన్యవుగమ్ము.ఈగొజ్జఁగులను,మల్లెలను,నాతని నారాధింపఁ గోయుదము రమ్మ.(అని చేయివట్టి లాగును.)

క:—సఖీ! ఆతఁడే మనచెలిమనోదైవమని నీవెట్లు పోల్చితివి?

అర:—తెలివిమాలినదానవు నీవుగాక యింకెవరు? మన చెలి తాఁ గలలోఁగాంచినరూపమును నింతకొకక్షణమునకుఁబూర్వమే గదా పూసగుచ్చినట్లు వర్ణించి మనకండ్లయెదుటఁ బెట్టినది. అపుడే మఱచితివా?

త:—ఆతఁ డెవ్వఁడు?

అర:—ఓసీ! మంటిబుఱ్ఱదానా! ఆ యాకృతి, యా కృత్యము గోపాలునిదిగాక మఱియెవరిదగును? లోకులమాటలేని నీ చెవికిఁ బాఁకలేదే? ఆమె మన కనుల దుమ్ముగొట్టుచు నిపుణముగ నాతఁడెవ్వఁడో తెలియనట్లు మాటలాడెనుగాని తాఁ గలలో గాంచినవానిని దా నెఱుంగదా? పాలుద్రాగు పసికూనయా యేమి?

క:—యదుకులోద్ధారుఁ డిందులకు రాఁ గతమేమి?

అర:—కార్యాంతరవశమున నెటకో యేగుచుండెనో లేక నిరంతర స్మరణమునకు లోఁగి భక్తరక్షకుఁడు మన చెలిని బాలింప వచ్చెనో నేనేమెఱుంగుదును?

రు:—నాన్నగారు విన్నఁ గోపింతురు. మీ రుండిన నుండుఁడు. నే నింటికి సత్వరము పోవుదు. (అని వెనుకకు మఱలును)

క:—(అంత చేయిఁబట్టి నిలిపి) ఎట కేగెదు. పూజ్యులు నందును నీ మనఃప్రియుండు నీవంక కాడఁబోయిన తీర్థ మెదురగునట్లు వచ్చుచుండ నర్చింపక విడనాడిపోవుటుచితమే. అతిథిసత్కార మనంత ఫలదమని తెలియవే. (అని పూలఁగోయుచుండును)

(రుక్మిణి నిశ్చలయై నిల్చి మైమఱచి శ్రీకృష్ణాకృతింజూచుచుండును)

అర:—(కొన్ని గుచ్ఛములఁ జేఁబూని రుక్మిణి వెనుకపాటున నిల్చి) ఏదో గాలిదయ్య మిట నాసఖి నావేశించి కదలనీయకున్నది. ఆర్త త్రాణపరాయణా! రక్షింపుము. (అని సహాసముగ నాక్రోశించును)

(శ్రీకృష్ణుడు సమీపించి)

కృ:— తే.గీ. ఆర్త రక్షణమన్న మా•కతి ప్రియంబు
అహిత శిక్షణమన్న మా•కతి హితంబు
అతివ తెల్పవె మీ చెలి•యతనుపీడ
తొలఁగఁజేయుదు దీనికై • యలుకనేల?.

రు:—(సాధ్వస కంపము నభినయించుచు మై మఱచి చూచుచుండును.)

క:—ఆర్యా! తామెవ్వరు? ఈ యబలోద్యానమున విహరింపఁ బనియేమి? తమయాకృతిం బరికింప మహాత్ములవలెఁ గన్పట్టుచున్నవారు. మా చెలికేమియు నిందుఁ బీడ కలుగలేదు. అబలగాన నీపొదలదూఱి నడువఁజాల కటనటనాగుచున్నది. అందులకీ నా ప్రియసఖ యరవింద హాస్యమునకై యట్లాక్రోశించినది. ఇట్లామెను వినోదపఱచుచుండుట మాకు దిన మలవాటైయున్నది. కాన తామీ విషయమున నొక్కింతయు శ్రమనందఁ బనిలేదు. చెవుల నాక్రోశము సోఁకినంతనే దయమీఱఁ దామరయ వచ్చినందుల కే మెంతయుఁ గృతజ్ఞలము.

(అంత శ్రీకృష్ణుని చెలికాఁడు లలితుఁడు సంభ్రమమున నేతెంచి)

లలి:—వధూటులారా! ఇతఁడు వసుదేవునినుతుఁడు వాసుదేవుఁడు. విదర్భదేశ దిదృక్షను వచ్చినాఁడు. సాయంసమయ మగుటం జేసి చల్లగాలికై మెఱుఁగక యబలోద్యానముం జేరినవాఁడు. ఆర్త రక్షణబిరుదాంకితుండీ నా చెలికాఁడాక్రోశమునాకర్ణించి

యనుష్ఠదఘుండై మిమ్మరయ నేతెంచినవాఁడు. మీరెవ్వరు?
ఇట మీరిటు విహరింప నిమిత్తమేమి?

అర:—(శ్రీకృష్ణాభిముఖయై దోసిలొగ్గి) ఆర్యా! తమ్ము నెన్నఁడు దర్శింపలేదు. నేఁడట్టి మహాభాగ్యము సంభవించినందుల కీదినము నెంతయు నభినందింపవలసి యున్నది. మేము కడు ధన్యులమైతిమి. మా యారామ మతిపవిత్రమయ్యె. మానెచ్చెలినోములెల్ల ఫలించె. పరమ పురుష! ఈ మా భర్తృదారిక కన్యగాని గడుసరిగామింజేసి తమ్ము నేగతినేని యారాధింపఁజాలకున్నది. మన్నించి మదిని మఱేమియు ననుకొనకుఁడు.

లలి:—మీరెవ్వరని యడిగినదాని కుత్తరము చెప్పరేల?

అర:—ఈబాల భీష్మకభూపాల ప్రియకన్య రుక్మిణి. మే మామె నెచ్చెలులము. ఇది మా విహారమునకే యేర్పడిన కన్యారామము. విశదమైనదా?

లలి:—కృష్ణా! ఇది యిందువదనల విహారదేశము. ఇందు మన మెఱింగియు నుండరాదు. పోదము రమ్ము. వచ్చినకార్య మైనదిగదా! (అని చేయిపట్టి లాఁగును. కృష్ణుఁడు రుక్మిణిని సవిలాసముగఁ జూచుచు ముందునకుఁబోక నిల్చును.)

అర:—మహాభాగ! మా నెచ్చెలి కుసుమాంజలి ప్రదానపూర్వకముగ మిము సంభావింపఁదలంచియు సిగ్గుచేఁ జేయిచాఁచలేక సంకోచపడుచున్నది. దరిఁజేరి యంది యామెను ధన్యం జేయుఁడు. (అని పూలఁదోసిలిని నింపి కుసుమాంజలి సనాథ యైన రుక్మిణిని ముందునకుఁ ద్రోయును. రుక్మిణి పోఁజాలక యధోముఖయై నిల్చును)

శ్రీకృ:—హరిణాక్షులారా! మీ భక్తికెంతయు సంతసించితి. మీ మన్ననలు మమ్ముం జెందె. వేఱ గౌరవింపనేల? మీనెచ్చెలి

పరమాత్ముని యనుగ్రహమునకుఁ ద్వరలోఁ బాత్రముగాఁ గలదు.ఆమెను శ్రమపెట్టకుఁడు. (అని పోవ నుద్యుక్తుఁడగును.)

అర:—ఈ మా ప్రియసఖికి బాల్యప్రాయమునుండి యా జగత్పతి యారాధనమనిన నత్యంతప్రియము. అనుదిన మా జగన్మోహను నర్చింపక యాహారముం గొనదు. ఆ మోహనమూర్తి యనుగ్రహ మెట్లున్నదో యెఱుంగక పరితపించును. వాను దేవుఁడు పరమపూరుషుండని భక్తి నుతించు. పరోక్షమున నట్లచ్చపుబత్తిమెయి పూజించునీమె ప్రత్యక్షముగ నా పరమాత్మ గోచరించినవు డారాధింపక విడుచునా! లజ్జాభరము కల్మి జంకుగొనియున్నదిగాని యొండుగాదు.

కృ:— సర్వేశు నారాధించువారి కోర్కులు కొనసాగకుండుటయు నుండునా? అబలా! నీపలుకులు మా వీనుల కమృతపుసోన లైనవి. భక్తుల సత్సంకల్పమును సర్వేశుఁడు సఫలముచేయక మానఁడు. మీరింకఁ జీకటియగుచున్నది గాన నింటి కరుగుఁడు. మేము నీ యబలోద్యానమును వీడి యీ చెంతనున్న యరదము నధిష్ఠించి పట్టణమునకుఁ బోదుము. (అని పోఁ బోవును. (అంత సత్వరముగఁ గల్యాణి వచ్చి రుక్మి యా యుపవనప్రాంతమున కేతెంచుచున్నవాఁడని తెల్పును. (రుక్మిణి భయము నభినయించును.)

అర:—ఆర్యా! అన్నగారిరాక కెంతయు మానెచ్చెలి భయమందెడి. మీరిమ్మార్గమునదయచేసిన నేరికంటనుబడరు. మేమునునెచ్చెలిం దోడ్కొని యరుగుదుము. సెలవిండు. పోయివత్తుము. దయయుంచుఁడు. దైవము పునర్దర్శనశుభముం బ్రసాదించి మము ధన్యలం జేయుఁగాక.

(రుక్మిణి భయాధీనమానసయై పరుఁగిడి సోదరింటఁ దూఱును. శ్రీకృష్ణుడును జెలికానితో మార్గాంతరమున నుపవనమువీడి చనును. పిదప నరవిందాకల్యాణులు మార్గాంతరమున రుక్మిణిని దోడ్కొని యింటి కరుగుదురు.)



శ్రీరస్తు.

# రుక్మిణీ కల్యాణము.

## ద్వితీయాంకము.

[భీష్మక భూపాలుఁడు, ఆతని భార్య సతి.]

భీష్మ:—దేవి! దేవర్షి పితౄణములు దీరినవి. ఇంక మనజన్మమునకొక్కటి మాత్రమే కొఱంతయున్నది. మనముద్దుపట్టికను రూపవరుని సంఘటించిన నాకొఱంతయుఁ దీరును.

సతి:—నాథా! ప్రాయమువచ్చినపడంతి ననురూపవరునితో సమకూర్పకుండుట సమయవిరుద్ధమని యార్యులందురు. మఱియుఁ గన్యనెవనికైన నెపుడైన నీయకతప్పదుగదా! కాన నుచితవరు నాలోచించి యుద్వాహ మొనర్పుఁడు.

భీష్మ:—సతీ! రూప గుణ బల శౌర్యసంపన్నుని నభిజాతు నొక రాకొమరు నాలోచించి చెప్పుము. వానికిచ్చి కల్యాణము చేయుదము.

సతి:—మహాప్రభూ! నేనంతగాఁ దెలిసినదానఁగాను. కాని మనలో మనమాలోచించి మనకు నచ్చిన వరున కిచ్చుటకంటెఁ గన్యాశయము ననుసరించి కార్యక్రమ మాలోచించుట యుచితమని తోఁచెడిని.

భీష్మ:—ఏమట్లంటివి.

సతి:—నాథా! బాలప్రాయమున భవదంతికమున శ్రీకృష్ణ భగవానుని సుగుణములు మహీసురులుకీర్తింపఁ జెవులపండు వుగ విన్నదిమొదలు రుక్మిణి యాతనినే వరింపఁగోరుచున్న దని తెలియవచ్చుచున్నది. మఱియుఁ గొలఁదిరోజులక్రింద మనదేశముం గాంచవచ్చి మనయింట నతిథియైయున్న యా తనిఁ గన్నులారఁ గాంచినదిమొద లాతనినే భర్తగాఁబొందఁ గోరుచున్నదని వింటిని.

భీష్మ:—దేవి! కృష్ణున కిచ్చుటకు రుక్మి యంగీకరించునా! ఈ విష యమున వానియభిప్రాయమునుగూడ దెలిసికొనవలసియుం డును గాన వాని నాహ్వానింతును.

సతి:—చిత్తము.

భీష్మ:—దౌవారికా!

దౌ:—(వచ్చి) చిత్తము మహాప్రభూ!

భీష్మ:—యువరాజుం దోడ్కొని రమ్ము.

దౌ:—(చిత్తమని నిష్క్రమించును.)

భీష్మ:—సతీ! రుక్మి కృష్ణునిమాటయనిన నలుగును. అట్టివాడికా ర్యమున మనతో నేకీభవింపఁడు. నిజము.

సతి:—తలిదండ్రుల కన్నదమ్ములకు నచ్చినవరునకా! కన్యనిచ్చుట? క్షత్త్రియులలో నిట్టియాచారముగలదా! ఈడువచ్చినవఱ కేల వివాహ మాచరింపకుంటిరి. అష్టవర్షప్రాయకే వివాహ మాచరించిన మనయుద్దేశము సఫలమగుటయేగాక యింత సందేహము లేకపోవునే!

భీష్మ:—అదిగో యువరాజు వచ్చుచున్నవాఁడు.

రుక్మి: (ప్రవేశించి జననీజనకులకు నమస్కారమొనర్చి) తండ్రీ! మీరు ముడు తలు వడిన ఫాలముంజూడ దీర్ఘాలోచనచేయుచున్నట్లున్నది.

అంత విచారింపఁదగిన, యసాధ్యకార్య మెద్దియైయుండునో నా కానతిచ్చిన నొక నిముసములో నద్దానిని నెఱవేర్చి మీ యమోఘాశీర్వచనముల నందుట కిదె సంసిద్ధుఁడనై యున్న వాఁడను.

భీ:—బలశౌర్యసంపన్నులగు నీవురు పుత్త్రులకుఁ దండ్రినగు నాకు విచారమననేమి? కల్యాణిరుక్మిణి యుద్వాహయోగ్యవయస్క యగుట ననురూప వరాలోచనావశమున నిట్లున్నవాఁడను. ఈవిషయమున నీయాశయము నెఱుంగఁదలంచి నేను నిన్ను రావించితిని.

రుక్మి:—జనకా! ఈ యలంతియంశమున కింత చింతింపఁ బనిలేదు. అతులబాహుబల సంపన్నుండును వైరివారణకేసరియు నరిరాజజేగీయమాన యశుండును చేదిరాజ్యలక్ష్మీసమాలింగితుండును నుత్తమ క్షత్త్రియవంశజుండును సుందరుండును నగు శిశుపాలుండుండ నితరవరు నాలోచింపనేల!

భీ:—దేవి! నీ యభిప్రాయ మేమి!

సతి:—కన్యాశయము ననుసరింపక యుద్వాహకార్యక్రమ మాలోచింపరాదని మున్నే మనవిచేసితిని.

భీ:—వృద్ధదావారికా!

దా:—చిత్తము.

భీ:—కన్యాంతఃపురముననున్న రుక్మిణికి వార్త నంపుము.

దా:—చిత్తము. (అని నిష్క్రమించును.)

రు:—(లజ్జావనతముఖియై యేతెంచి తలిదండ్రులకు నన్నకు నభివాదన మొనర్చి తదనుమతిని దల్లిచెంతఁ గూర్చుండును.)

భీ:—తల్లీ! ప్రతిదినమునఁ బ్రాతఃకాలముననె కనులపండువు సేయు నీ వీదినమున నింతతడవు మసలుటకుఁ గారణమేమి?

రు:—జనకా! మాసశివరాత్రి యగుటచే నుమా మహేశుల దర్శింపఁ బోయితిని.

భీ:—ఉపవాసాదివిధుల సుమాంమహేశుల నీవతిభక్తి నర్చించుచుంటి వని వినుచున్నాను. బాల్యమున నీవిట్టి దుస్సహవ్రతములఁ జేయుచు నీ కోమలతనువల్లిఁ గృశింపఁజేయఁ బనియేమి? రాజపుత్రివగు నీకు లభింపరాని యర్థమెద్ది?

రు:—తండ్రీ! ఎంతవారికైనను భగవదనుగ్రహము వాంఛింపఁదగి నదే. అయ్యది లేకున్న సర్వమును విఫలము. సర్వమును శూన్యము. మఱియు సుమాంగల్యమును సంపాదింప సర్వమంగళానుగ్రహ మావశ్యకమని యార్యులన విందు.

సీ. చింతిత కల్యాణ♦సిద్ధి సౌధంబెక్క-
సార సోపానాళి ♦ గౌరిపూజ
వాంఛిత సస్యాళి ♦ వర్ధిల్లఁగాఁజేయు
వార్షికాంబుదము భ ♦ వానిపూజ
వర సుమాంగల్యామృ♦త రసంబు ద్రావింప
మోహిని గిరిరాజ♦పుత్రిపూజ
పరమాయురారోగ్య♦ వరఫలంబులుగూర్పఁ
బారిజాతము శివ♦పత్నిపూజ

తే. గీ. ఇది యుది యనంగనేల య♦హీన భక్తి
సర్వమంగళ నర్చించు ♦ సజ్జనులకు
సర్వము సుసాధమే గాన ♦ జనక! నియతిఁ
బూజసేయుదు గౌరిఁ ద్రి♦భువనమాత.

భీ:—తల్లీ! సకలసామంతరాజ సమభ్యర్చిత పాదపద్మునకు బలశౌర్య నిర్జిత రాజలోకునకు (జేదిరాజ్యభర్తకు నిన్నిచ్చుటకాలోచిం చియు నీయాశయము నెఱుంగక నిశ్చయింపరాదని మీయమ్మ యనుటచే నిన్ను రావించితిని.

రు:—(మొగము చిట్లించికొనుచు వంచికొని మాఱు పలుకక తల్లి వైపుఁ జూచును.)

సతి:—నాథా! కుమారా ! క్షత్రియకన్యలు స్వయంవరలబ్ధవరునిఁ గాని స్వయముగాఁ దాము ప్రేమించినవానిఁగాని వరించుట యాచారమైయున్నది. కాని జననీజనకులకు నన్నదమ్ములకు నచ్చినవరుని వరించునాచారములేదు. కాన క్షత్రియాచారము ననుసరించుట లెస్స.

రుక్మి:—కన్య వరింపరానివరుని వరించినను నామెను వానికిచ్చి యుద్వాహము చేయవలసినదేనా?

సతి:—పుత్రా! ఉత్తమక్షత్త్రికులజాత యెన్నఁడైనవరింపరానివాని వరుని గాఁ గోరునే ?

రుక్మి:—జననీ! మీ యూహాలు వేఱుగానున్నట్లు నేను కర్ణాకర్ణికగా వినియున్నాను.

సతి:—పుత్రా!

ఉ. రాజకుమారికామణులు ♦ రాగమునం దమయంతిఁ దాము రా
రాజులయందు నిష్టుని ధ ♦ రన్వరియింపఁగలేదె స్వేచ్ఛగా
రాజకులప్రసూతయగు ♦ రామకు నవ్విధి ధర్మ్యమేగదా!
రాజకుమార! కావున ధ♦రాపతి పుత్త్రిలఁ బిల్వఁ బంపుమా.

రుక్మి:—స్వయంవరమునసైన నింతకంటె నధికుఁడగు రాకొమారుఁ డెవ్వఁడు లభించును.

సతి:—యదుసింహుఁడు లేఁడే?

రుక్మి:—ఆతనికిచ్చుటెన్నఁడు బొసఁగదు.

చ. అనిశము నాలమందలన♦హాయనితోలుచు దొంగమై సదా
కనికరమైనలేక దధి♦ఖండములం దిని పాలఁద్రావి వే
వనితలఁగూడి జారుఁడయి ♦ వర్తిలు గొల్లలయిండ్ల నాతఁడా
వనితకు యోగ్యభర్త? సరి♦వారలు నవ్వరె చాలు నింతకున్.

(చెల్లెలి నుద్దేశించి)

చ. కులమునఁ బెద్దయుంచు మదిఁ ♦ గోరితివో పటుబాహువిక్రమా
దుల శిశుపాలుతోడఁ దులఁ♦దూఁగెడు మేటియటంచు నెంచితో
తలఁచితివో మహీంభరముఁ ♦ దాల్చిన రాజవతంసుడంచునో
చెలియల! క్షత్రిబంధవును ♦ జేకొన నీమనసెట్లు నచ్చెనో?

(తండ్రితో)

తే. గీ. మహితరాజ్యలక్ష్మిసేవ్య♦మానుఁడైన
యఖిలసామంతరాజ స♦హాయుఁడైన
యట్టి శిశుపాలునకు మాని ♦ పట్టినకట
కృపణ పశుపాలునకుఁగట్ట ♦ త్రిపయు లేదె.

ఉ. ప్రాయము బాహువిక్రమము♦ బాంధవమైత్రియుఁ గల్గి రాజ్యల
క్ష్మీయుతుఁడై యరాతికుల♦సేవితపాదసరోజుఁడైన యా
యాయతకీర్తిఁ జైద్యుని మ♦హామహు వీడి కుమారికామణి
న్మాయలవానికిచ్చుటిది ♦ న్యాయ్యమె రాజులునవ్వరే మిముః.

(అని దిగ్గున లేచిపోనుండ)

భీ:—(వానినాపి)కుమారా! క్షత్త్రివరచిహ్నములు శిశుపాలునియందున్న మాట నిజమే. కాని యాతని జన్మవృత్తాంతమునుబట్టి యాలోచింపఁ గృష్ణునివలన నాతనికి నాశముగల్గునని నిశ్చయింపకతీరదు. కన్నులారఁ గాంచుచు నట్టివానికెట్లు కన్య నిచ్చుట కంగీకరింతు. కాన మీాయమ్మ చెప్పినదాని కంగీకరింపుము.

రుక్మి:—జనకా ! గోవులఁ గాచువాఁడాతని కేమిచేయఁ గలఁడు. అయ్యది శ్రీకృష్ణుని మాయగాని యాకాశవాణివాక్యము గాదు.

సతి:—కుమారా! అట్లనకుము. తలంచినఁ ద్రిభువనములనైన నొక్కపెట్టున శ్రీకృష్ణుఁడు జయింపఁగలఁడు. ఆతనిలీలల నెఱుంగ నేరికిఁ దరముగాదు.

సీ. యాదవత్వమున సిం♦హాసనస్థుఁడుగాఁడు
గాని భూజాని ర♦క్షకుఁ డతండె
కాఁడు క్షత్త్రియుఁడందు♦ కాని క్షతత్రాణ
మొనరించుటఁ క్షత్త్రి♦యుం డతండె
రాజగాఁడనుట యా♦రసముననేగాని
ప్రకృతిరంజనమున ♦ రాజతండె
గొల్లవాఁడని యార్ష్య♦గాని యనుటేగాని
సద్భావమున నభి♦జాతుఁ డతఁడె
తే. గీ. తవిలి పేదంబెగాని శ్రీ♦ధరుఁ డతండె
చోరుఁడనుటయెగాని స♦చ్ఛూరుఁడతఁడె
జారుఁడనుటయెగాని స♦చ్చరితుఁ డతఁడె
శుంఠయనుటయెగాని వి♦జ్ఞుం డతండె.

రుక్మి:— వెఱ్ఱి జనులాతని భగవంతుండని పొగడినమాటలనుబట్టి మీరును నట్లాడుచున్నారు. శిశుపాలు నాతఁడేమియుఁ జేయఁజాలఁడు. నక్కయెక్కడ? దేవలోకమున కెగురు టెక్కడ? నామాటనునమ్మి శిశుపాలున కిచ్చి యుద్వాహ మొనర్పుఁడు. దీన మన కుత్తరోత్తరాభివృద్ధి కలుగునని ముమ్మాటికి నమ్ముఁడు.

భీ:— కృష్ణుండుమాత్రము మనుష్య మాత్రుఁడని తలంపకుము. తలంచినఁద్రిభువనములనొక్కనిముషమున జయింపఁగలఁడు. పురహరుఁడును నాతనిఁబోర గెల్వఁజాలఁడునుమా!

రుక్మి:— నాన్నగారూ! అతనినట్లు పొగడకుఁడు. ఆతడేయంతటి పరాక్రమవంతుఁడైనచో లోకముననట్టి నానుడియాతనికి రానేల?

భీ:— సతీ! పుత్రి! భగవంతుండగు శ్రీకృష్ణునకుఁ గన్యనిచ్చి తరించు నదృష్టము మనకులేదు. భావిరాజైన రుక్మిమాటయంగీకరింపకుండుట యనుచితము. శిశుపాలునియందు క్షత్రవర చిహ్నములు సమగ్రముగానున్నవి. మఱియు నింతకు

మున్ను కన్యఁ దన కీయవలసినదని మంత్రుల మూలమున నాతఁడు దనయాశయమును దెలియఁజేసియున్నాఁడు. అతని కోర్కె కంతరాయము సంభవించిన నాతఁ డేదుర్వ్యవసాయమునకు దిగునో! భవాన్యనుగ్రహమువలన రుక్మిణి కిట్టియమంగళమును సంప్రాప్తింపదు. ఈయంశముల నాలోచింపఁ గలహింపక శిశుపాలునకిచ్చుట కంగీకరించుట మంచిదని తోఁచెడిని. కావునఁ బురోహితు నడిగి యీ వైశాఖమున వివాహ మాచరింతము.

(ఏమనుటకు నోరాడక తల్లియు రుక్మిణియు సెలవుగై కొనిపోవుదురు. కుమారునితోడ భీష్మకుఁడును బోవును.)

ఇ ది ద్వి తీ యాం క ము.





శ్రీరస్తు.

# రుక్మిణీ కల్యాణము.

## తృతీయాంకము.

కన్యాంతఃపుర బహిరారామము.

[ 1. అరవింద, 2. కళ్యాణి. ]

అ:—సఖీ! మన చెలిజాడ చూడ నొకతీరుగానున్నది సుమా!

క:—నాకేతీరును దెలియదు సుమా!

అ:—నీవు మృత్పిండబుద్ధివి.

క:—నిజమే! నాకు జాడలుకట్టుట తెలియదు.

అ:—అలనాఁడుద్యానవనవిహార సందర్భమునందలి మనచెలి నడవడిని జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము.

క:—ఏమో! నాకేమియుఁ దెలియదు.

అ:—కోకిలకూజితముల కదరిపడుట యళుల ఝుంకారముల కులికిపడుట శీతల సుగంధవాయుస్పర్శమున కుస్సురనుచుఁ గృష్ణ కృష్ణాయని నొక్కొకచో నొరగుట మున్నగు సందర్భముల వలన నేమి తెలియుచున్నది?

క:—ప్రాయమువచ్చినదికదా! ఇందు వింతయేమున్నది.

అ:—సఖీ! కృష్ణునిపై నామెమనము లగ్నమైనదని నీకాసందర్భము వలన నవగతము గాలేదా?

క:—సదృశవరుని సమకూర్ప సర్వేశుఁడు సంకల్పించుఁగాక. బాల్యప్రాయమునుండియు నామె యదుపుంగవునే జీవితేశుఁగా నమ్మియున్నదని యీబాలగోపాల మెఱుంగు! ఇందు వింత యేమున్నది. మఱియు నుపవనమునఁగాక జనకునింటంగూడ గృష్ణసందర్శన మామెకు లభించినది.

అ:—సఖీ! వింటివా మఱియొక వింత.

క:—అంత వినఁదగిన వింతయేమి?

అ:—మనసఖిమనోరథము వ్యర్థమయ్యెనఁట.

క:—ఆమెకోర్కె యెట్లు వితథమగును.

అ:—రుక్మి కృష్ణునకిచ్చుట కెంతమాత్రము సమ్మతింపలేదఁట.

క:—అయ్యో! రుక్మి కేమట్టి దుర్బుద్ధిపుట్టినది. జననీ జనకు లూరకుండి రే!

అ:—ఊరకొన కేమిచేయఁగలరు? ప్రధానపుఁబట్టియైనట్టి పెద్దకొడుకు మాట వినకుండు టెట్లు?

క:—అయిన రుక్మిణి నెవనికిచ్చుట కాతఁ డంగీకరించును.

అ:—మఱి యెవనికి! శిశుపాలునకు.

క:—అ యుక్తాయుక్త వివేకశూన్యునకా?

అ:—ఏమట్లంటివి. ఐశ్వర్యమున నేమి వయసున నేమి శిశుపాలుఁడు రుక్మిణికిఁ దగినవరుఁడు కాఁజాలఁడే.

క:—దుష్టులతో సహవాసము, దురాలోచన, భగవద్ద్వేషము, నిర్దయ, మున్నగు దుర్గుణములకాటపట్టనిశిశుపాలు నార్యులు నిందించుచుండ విందు. కాన నాతఁడీమెకెన్నఁడును భర్త గాఁజాలఁడు. కావుననే రుక్మిణి యాతడనిన నులికిపడును.

అ:—రుక్మిణి యిపుడేమిచేయును? ఇంక శిశుపాలునిఁ బరిగ్రహించునా?

క:—సఖీ! నిజమే కాని సఖురాలికొక యిక్కట్టు వచ్చినపు డద్దానిం దీర్ప మనము యత్నించుట ధర్మముగాని యూరకుండుట న్యాయ్యము సుమా!

అ:—మనమేమి శేయఁగలము?

క:—ఉషానఖ చిత్రలేఖ యేమిచేసినది? చెలియన నామెయే!

అ:—కడ కేమైనదో యాలోచింపుము.

క:—ఏమైనది. ఉషానిరుద్ధులు జంపతులై రాలేదా?

అ:—మనకట్టి మంత్రశక్తిని దేవుఁడు ప్రసాదించియుండలేదే!

క:—మంత్రశక్తిని బ్రసాదింపకున్నను బుద్ధిబలమును బ్రసాదించి యున్నాఁడు. బుద్ధిబలముచే సాధింపరానికార్యములేదు. కాన మనబుద్ధిబలముచే నామెనీయాపదనుండి తొలఁగింతము.

అ:—అయిన నీవే యుపాయ మాలోచింపుము. మనపై నేమియు రాకుండ నుండవలెనుజుమా!

క:—ఆలోచించియేయుంటిని. మనసఖగురుఁడు సుదర్శనుఁడే యిక్కార్యమును సాధింప సమర్థుఁడు. అతనిం బ్రార్థింతము.

అ:—అతఁ డేమిచేయఁగలఁడు?

క:—కృష్ణునితో నీయంశమును విన్నవించి యాతనిందోడి తెచ్చును.

అ:—పోనిమ్ము. మన కెందులకా చిక్కులలోఁబడుట. శ్రీకృష్ణుం డింతమాత్రమున వచ్చునో రాఁడో? మీఁ దేమగునో!

క:—ఆర్త రక్షణ బిరుదాంకితుండు శ్రీకృష్ణుం డొక యబల ననాథను శరణుచొచ్చినదానిని సంరక్షింపకూరకొనఁడని ముమ్మాటికి నమ్ముము.

అ:—శ్రీకృష్ణుఁడుమాత్రము శిశుపాలాదుల భీమబలుల జయించి రుక్మిణిని బరిగ్రహింపఁగలఁడే?

క:—ఏమీవెఱ్ఱి! అతని కియ్యది యొక యసాధ్యకార్యమా?

అ:— స రే (దృష్టిని బ్రిసరింపఁజేసి) అదిగో యినలీక్ష పొదురగుచ ట్లదిగో సుదర్శనుండె యిటకే తెంచుచున్న వాఁడు. విన్నవింప వలసిన యంశముల విన్నవింపుము.

క:—నీవు తటస్థవై యుండెదవా?

అ:—లేదు. నేనును సాయము వట్టెదను.

[సుదర్శన ప్రవేశము.]

క:-అ:—ఆర్యా! వందనము.

సు:—'చింతిత కల్యాణ సమృద్ధిరస్తు'(అనిదీవించి) మీరిచట నేమి యాలోచించుచున్న వారు?

క:—మహీసురవరా ! మాకు నీవలనఁ గాఁదగిన యొక కార్యముం డుటంజేసి మీరాక కెదురుచూచుచున్న వారము.

సు:—మీకార్యములఁ జక్కపెట్టుటకుఁగాని మీమాటలు వినుటకుఁ గాని నాకవకాశము లేదు.

అ:—అయ్యా! ఆత్మార్థముగాదు. పరోపకారార్థమే మిము వేఁడు కొనుచున్న వారము.

సు:—పరోపకారమైనఁ దప్పక చేసెదను.

క:—ఆర్యా! మహారాజదారిక నేఁడస్వస్థయైయున్నది. తా మటకుఁ బో నవసరము లేదు. కాన మా విన్నవించువిన్నపము సావ ధానబుద్ధితో నాలింపుఁడు.

సు:—మహారాజదారికకుఁ గలిగిన యస్వాస్థ్యమేమి?

క:—అయ్యా ! తాము పుత్రికాభావనం బ్రేమించు రుక్మిణి కొక యాపద రానున్నది. దాన నామె యస్వస్థయయ్యెను.

సు:—(సంభ్రమముతో) రాజపుత్రికకా! ఆపదా! రానున్నదా!

క:—అజన్మాంత మనుభవింపవలసిన యాపదయే రానున్నది.

సు:—రాజపుత్రియగు రుక్మిణి   ఆపద యేడ ?

క:—గురులతోఁ బరిహాస మాడుదుమే?

సు:—ఎట్టియాపదయో విశదముగా నుడువకున్న నమ్మఁజాలను.

క:—అసత్యముగాదు. సావధానచిత్తులరై యాకర్ణింపుఁడు. రుక్మి రుక్మిణిని శిశుపాలున కీయ నిశ్చయించినవాఁడు. రుక్మిణి బాల్యమునుండియు గోపాలకృష్ణునే వరింపఁదలంచియున్నది. ఆశ్రీకృష్ణుడు భర్తగా లభింపకున్న నూతనో గోతనో పడి ప్రాణములవిడువ నూహించుచున్నదని తెలియవచ్చుచున్న ది.సిగ్గుచే మీవంటివారలతో మనవిచేయఁజాలక లోలోపలఁ గుందుచున్నది. కావున నార్తత్రాణపరాయణుండగు చక్రి కీచరిత్రమును సాకల్యముగా నెఱింగించి యాతనిం దోడి తేవలసియున్నది. ఆర్యా! ఈకార్యభరము మీపై మోపి తిమి? శ్రమయని తలంపక కార్యమును నెఱవేర్చి పుణ్యమును గట్టుకొండు.

సు:—విదర్భయెక్కడ? ద్వారకయెక్కడ? వృద్ధబ్రాహ్మణుఁడ నే నెక్కడ? పోవుటెక్కడ?

అ:—ఎట్లో యోపికపడకతీరదు. కృష్ణుడు సంతసించి మిమ్ముఁ గుచే లునివలె శ్రీమంతునిజేయును. రాజపుత్త్రి మీ కగ్రహార ముల నిచ్చును. పొండు.

సు:—సరే! దాని కేమి. ఈమూలమున శ్రీకృష్ణుని దర్శనముచేసి ధూతాఘుఁడనయ్యెదను. మఱియు నమోఘరాజదారికాను గ్రహమునకుఁగూడఁ బాత్రమనయ్యెదను.

క:—ఎట్లాతనిచిత్తము మెత్తనగు నెట్లాతఁడా మెనుభార్యగాఁ బరిగ్రి హించునట్లు నటించి శీఘ్రిమ శ్రీకృష్ణసహితులరై రండు. మార్గమున మీకు శుభమగుఁగాక!

సు:—ఇవుడేపోయి మహీపాలు నొకవారము సెలవడిగెదను.

క:—అభూకాంతునితో నీయేకాంతమును జెప్పకుఁడీ!

సు:—శుభమస్తు. (అనిపోవుట కుద్యుక్తుండగును.)

క:—సరే! ఆర్యా! మాసఖి యేమైన మీతో విన్నవించుకొను నేమో? కావున మేమామెకడ కేఁగి మీకు వార్తనంపుకొని యెదము. అంతవఱకు మీరు కన్యాంతఃపురమున కభిముఖముగానున్న చంద్రికాంతవేదికపైని విశ్రమింపుఁడు.

సు:—ముసలివాఁడను. లగ్నదిన మాసన్నమైయున్నది. కార్యము సఫలముకాకున్న మీరును నామెయును నన్ను నిందింతురు. రాజగృహమునకేగి మహీపాలు సెలవంది యొక గడియకుఁ గన్యాంతఃపుర ద్వారవేదిం జేరువాఁడ. వేగమె వార్త నంపుఁడు.

(అని సుదర్శనుఁడు నిష్క్రమించును.
అరవిందా కల్యాణులును బోవుదురు.)



కన్యాంతఃపురము.



[శ్రీకృష్ణపటము చేఁబూని శయ్యపై రుక్మిణి విచారించుచుండును. మాటుననుండి యరవిందా కల్యాణులు వినుచుందురు.]

రు:- సీ. పురుషపుంగవ భవ♦త్పూతకథాసుధా
విభవామరంబు నా♦ వీనుదోయి
భువనమోహన భవ♦న్ముఖసుధాకరచంద్రి
కా చకోరంబు నా ♦ కన్నుదోయి
కాంతాభవత్క్రమ♦గాత్రిఘనాఘనా
శ్రిత బలాకంబు నా♦చేయిదోయి
దర్శనీయాభవ♦ద్వాసగమ్యాప్తి జం
ఘాలదూతంబు నా♦కాలుదోయి

తే. గీ. నామనోరథముం చెల్ప ♦ నా మనోర
థమ్ము నిందిరియములను ర♦థ్యములఁగూర్చి
సూతునిగ గాత్రముంజేసి ♦ శుభచరిత్ర!
యనుపదానను బాలింప ♦ నరుగుదేవె.

సీ. కాంతామనోభవా! ♦ కదలినేలయు నిలు
మదికృక్త హ్మృన్మణి ♦ మందిరమున
వనజాక్ష! పాపీటి ♦ యునికేల నిలుమయా
యమలమన్మానస♦కమలము దరి
వనమాలి! వనమున ♦ మనికేల నిలుము మ
ద్బాహుశాఖస్కంధ♦తలమునందు
అంబుదవర్ణ! తి♦క్తాంబుధినేల ని
ల్వమృతాబ్ధియా మదీ♦యాననమున

తే. గీ. మదనజనకుండ! యరయవే ♦ మానవతిని
దీనపరిపాల! చూడవే ♦ దీనురాల
కృష్ణ! చేకొనవే వేగఁ ♦ గీరవాణి
భక్తరక్షక! కావవే ♦ భక్తురాల.

(అరవిందా కల్యాణులు సమీపించి)

అర:—సఖీ! వెఱ్ఱిదానివలె నీలోనీవె మాటలాడుకొనుచున్నావేమి?
వాడియున్నావేమి?

రు:—(పటమును దాచి) మీకు వాడియున్నట్లగపడుచున్నానుగాని
నాకెట్టిచీకాకును సంభవింపలేదు.

అ:—పూఁదోఁట కేఁగిననాటనుండియు బొత్తిగాను మహేశ్వరార్చ
నకుఁ బోయిననాటనుండియు మాతో మాటలాడుట మాని
తివి. ఇట్టి సమయమందైన మముఁ బిల్పించంపి మాతో
సంచ్చటింపరాదే!

రు:—మిముఁ బిల్వఁ బంపుద మనుకొనుచుండ మీరే వచ్చినారు.

అ:—సఖీ! ఆ పద్యము నింకొకసారి పఠింపుము.

రు:—ఏ పద్యము?

అ:—భగవన్నామాంకితమగు నా పద్యము.

క:—పోనిమ్మా చిత్రపటమందేమి కలదో చూపెదవా?

రు:—మీకుఁబ్రసక్తిలేని యంశముల మీ రడుగరాదు.

అ:—పోనిమ్ము! ప్రసక్తికల్గినపుడే మే మడిగెదము. నీవును జెప్ప వచ్చును!

క:—సఖీ! నీకంతకోపము వచ్చునని నాకుఁ దెలియదు. అట్లయిన నే నడుగకుందును.

అ:—కల్యాణీ! ఆమెచెప్పదు. నేఁజెప్పెదను రమ్ము. అందు రామా మనోహరుని మనోహరవిగ్రహము కలదు.

క:—(ఆశ్చర్యముతో)ఆ! రామామనోహరుని మనోహర విగ్రహమా!

అ:—ఆ! అట్లే, రుక్మిణీమనోహరుని మనోహర విగ్రహము.

రు:—పరిహాసము లాడవచ్చిరే!

అ:—చెలీ! పరిహాసమెన్నఁడైన నిను మేమాడితిమే? ప్రథమమున నీవు పఠించినపద్యమునుబట్టి మే మట్లూహించితిమి.

రు:—నిజము ! ఇందు శ్రీకృష్ణభగవానుని సుందరవిగ్రహము చిత్రింపఁబడియున్నది. కోర్కి కలదేని చూడుఁడు. (అని పట మరవింద కిచ్చును.)

అ:—ఈ జగన్మోహనరూపునకు మన రుక్మిణి జాయయైన మనలఁ గనులఁ జూచునే!

క:—సౌందర్యరాశియగు నిమ్మహాత్ముని భర్తగాఁబొందిన నెవతె గర్వింపకుండును.

అ:—సఖీ ! చూచితె! అతిలోకమణీయ మీశ్రీకృష్ణుని చక్కఁదనము.

క:—కృష్ణునకీవార్త వినుపింపం జతురమతియగు నొకనిఁబంపిన నార్త త్రాణపరాయణుండగు నాతఁడు తప్పకవిచ్చేసి నిను సంరక్షింపఁగలఁడు. మఱియు నుపవనమున నీ మోహనరూపముం జూచెను గాన నాతండును నిన్నే యనుకరించుచుండక మానఁడు.

రు:—వార్తాహరునకు వాసుదేవదర్శన మెట్లులభించును?

క:—భూసురుండు గాని యీకార్యమును సాధింపఁజాలఁడు.

రు:—నిజము. మహీసురులు మహీపతుల యంతఃపురమునకైనఁ బోఁగలరు. వారల కడ్డంకి చెప్పువారులేరు. వారు సర్వతోగాములు. విద్యాధికులగుటచేఁ గార్య మెత్తెఱంగున సఫలమగునట్లు నేర్పుమెయి నర్తింతురు. కాన నట్టి భూలేఖుని మీరే యాలోచింపుఁడు.

క:—సుదర్శనుఁడే యీకార్యమును సాధింప సమర్థుండని తోఁచెడిని.

రు:—ఆతఁ డేమనునో? ఆతనితో నీకోర్కె యెట్లువిన్పింతును? చెలి!

ఉ. ఏమని విన్నవింతు హరి♦కిమ్మని కాన్కగ నేమియిత్తు నే
రామలు నిట్లుచేసిరె ధ♦రాస్థలి లజ్జనువీడి శీల ము
ద్దామ యశంబుఁ గోలువడి ♦ దారుణకృత్యము నెట్లు చేయుదుర్
భామల హాసగర్భమగు ♦ పల్కుల కే నగుదు లక్ష్యమెతిఁగా.

క:—అతఁడు కోపించిన నాతని యడుగులఁబడి యనుమతింపఁజేయఁగలము.

రు:—శ్రీకృష్ణుం డేమనునో? సఖీ!

సీ. బంధకీ ధార్ష్ట్యంబు ♦ బాల పూనె నటంచు
దామోదరుఁడు నన్నుఁ ♦ దలఁపకున్న
లలన నిర్లజ్జయై ♦ కులవధూశీలంబు
విడిచెనటంచు భా♦వింపకున్న

కాముకిగా నన్నుఁ ♦ గమలాయతాక్షుండు
　　స్థిరబుద్ధిఁ దాను జిం♦తింపకున్న
పాప్రిలుమాలినదాటఁ ♦ బాలనఁజేయు న
　　న్నలన వేఁడెనటంచుఁ ♦ దలఁపకున్న

తే. గీ. "ఉత్తమక్షత్రికులజాత ♦ యువతి మదిని
సదృశవరు నెన్నుకొనుట దో♦షంబుగాదు"
అని మనంబున మాధవుం ♦ డనుమతింప
కున్న నను వేగఁబ్రోవరా♦కున్న శౌరి.

క:—అతఁడేమియు ననుకొనఁడు. ఇట్టి సందేహముల మనముననుంచు కొనకుము. దిట్టవై యుండుము. మేమా సుదర్శనునితో సర్వ మును జెప్పితిమి. సందిష్టాంశమును మాత్రమే నీవాతనితోఁ జెప్పుము. మిగిలిన పని మేము చూచుకొందుము. (అని సఖులు నిష్క్రమింపనుండ దౌవారిక యేతెంచి సుదర్శ నాగమమును నివేదించి రుక్మిణియనుమతి నంది ప్రవేశపెట్టి పోవును.)

[ సుదర్శన ప్రవేశము. ]

రు:—(సంభ్రమముతో లేచి) భూసురరత్నమా! రుక్మిణి యిదే నమ స్కరించుచున్నది. (అని యడుగుల వ్రాలును.

సు:—"కల్యాణ పరంపరావాప్తిరస్తు! చింతిత మనోరథ సిద్ధిరస్తు!" (అని దీవించి రుక్మిణీ నిర్దిష్టాసనమునఁ గూర్చుండును.)

రు:—(లజ్జాతిశయమున మొగమువంచి సఖీ ప్రేరణమున) ఆర్యా! కులవధూశీలము నతిక్రమించితినని కోపింపక నా విన్నవించు విన్నపము నాలింపుఁడు. ఉపాయాంతరములేమి నిట్లు ప్రవ ర్తింపవలసివచ్చినందులకు క్షమింపుఁడు.

సు:—సఖీజనమువలన సర్వము తెలిసినది. ఆవంతయు భయ మంద కుము. నే నిదే సంసిద్ధుఁడనై వచ్చినాఁడను. కొంకక సందే శమును జెప్పుము.

రు:—భూదేవా! జనకునితో నీయుదంతమును జెప్పకుఁడీ. కొంప మునుంగును జుఁడీ! తమ కార్యముగా నెంచి యిక్కార్యమును సాధించి నా జీవితమును నిల్పి కలకాలము నా కృతజ్ఞతకుఁ బాత్రమవుగా నిదే వందనశత మర్పించుచున్నదానను.

సు:—రుక్మిణీ! వక్తవ్యావక్తవ్యములఁ దెలియనంతటి మూర్ఖుండనే? నన్నింత వేఁడుకొననేల! పోయి శీఘ్రము గోపాలుని దోడి తెచ్చెద. సందిష్టాంశమును జెప్పుము.

రు:—(దీర్ఘముగ నిశ్శ్వసించి)

ఉ. అన్న కృపావిహీనమతి♦యై శిశుపాలున కిత్తునంచు వి
ద్వన్నుత! పూనె సంగరము ♦తద్వశులై తలిదండ్రులుండ్రి నేఁ
జిన్నతనంబునుండి యదు♦సింహునె నమ్మితి భర్తగాను నీ
బన్నము గాచి నన్ను బరి♦పాలన సేయవె భూసురాగ్రణీ!

ఉ. ద్వారక కేఁగి చక్రికి న♦వార్యపరాక్రమశాలికిన్ దగన్
శౌరికి నా చరిత్రమును ♦ సాంతముగా వినిపించి యామహో
దారుని దోడి తెచ్చి నను♦తత్ప్రియఁగా నొనరింపు భూసురా!
వారని భక్తి నిందులకు ♦ వందన మే నొనరింతుఁ బ్రోవవే!.

సు:—శ్రీకృష్ణునితో విన్నవింపవలసిన విన్నపమును వేగ విన్నవింపుము.

రు:—మాయన్న పట్టుదలను విన్నవించి నేఁజెప్పఁబోవు వీనిం బొందుపఱచి విన్నవింపుఁడు.

ఉ. అంతిపురంబులోనఁ జొర♦నక్కఱలేదు భవానిఁ గొల్వ నన్
బంతురు పెండ్లినాఁడు♦భవుపత్నికి మ్రొక్కఁగ మ్రొక్కి వచ్చుచు

న్వింతగ రాజులెల్లఁ బలు♦వేడ్కను జూచుచునుండ వచ్చి నన్
బంతముతో గ్రహింపుమని ♦ పంకజనాభునితోడఁ జెప్పవే!.

మఱియుఁ దుదినామాటగా నీయభిజ్ఞానాంగుళీయక మర్పించి యిట్లు విన్నవింపుఁడు.

ఉ. పాలనసేయవేని శిశు♦పాల జరాసుతులం జయించి నన్
జాలముసేసి తేని నిజ♦జాయనుగా నను స్వీకరింప "గో
పాలభవాంతరేషు మమ♦వాపతిరస్తు త్వమేవ" యంచుఁ బ్రా
ణాలఁ బరిత్యజింతు నిది ♦ నమ్ముము నిక్కము జీవితేశ్వరా!.

(అని యభిజ్ఞానాంగుళీయకమిచ్చి నమస్కరించును. భూసురుఁడు సెలవుగైకొనిపోవుట కుద్యుక్తుఁడగును.)

ఉ. వెన్నునిమానసంబు నెటు ♦ వెన్నపలెం గఱఁగించెదో హరిన్
గ్రన్నన నెట్లు తెచ్చెదో ము♦రద్విషు నెట్టి వినీతిభాషలన్
సన్నుతి సేసెదో భువన♦సన్నుతుఁ డాతఁడు నన్ను జాయఁగా
మన్నన సేయునట్లుచిత♦మార్గము నట్టిది యాశ్రయింపుమా!.

సు:—సర్వథా కార్యమును సఫలముగాఁ జేయ యత్నించెద. ఇఁకఁ బోవుట కనుజ్ఞనిచ్చెదవా!

రు:—(ముత్యములహారమును చేఁబూని)

శా. భూలేఖా గొను రత్నహార మిదె స♦మ్మోదాన నర్పించితిన్
బాల న్మన్మథను దీనురాల దయ సం♦భావింపవే వేగ గో
పాలున్దెచ్చి మదీయజీవితము ని♦ల్పన్వేఁడుదాన న్ననున్
బాలన్మన్నించెదో నీటముంచెదవో నా♦భారమ్ము మీదే సుఁడీ.

(అని మెడలోవేసి) మహీసురరత్నమా! సమయము వచ్చినపు డుత్తమక్షత్రియవంశజాతయగుయువతి తన ప్రాణముఁ బూరిగా నెంచుననుమాట మీఱెఱుంగనిది కాదు. కాన సుముహూర్తసమయమునకు మున్నే మీరు శ్రీకృష్ణసమేతులరై వచ్చి శుభవార్తను విన్పింపవలెను జుఁడీ!

సు:—అమ్మా! అమంగళము శాంతించుఁగాక! అచిరకాలములో విజయశ్రీసనాథుని గోపాలుని గనుగొందువు. శుభముహూర్త దినమున కిచట గోవిందుండున్నాఁడని మమ్మాటికి నిశ్చయించికొనుము.

అర:—మీబోధనాశక్తి నిందెట్లు విని యోగింతురో చూచెదంగాక. రాజపుత్రి యనుగ్రహారదానమున మిము సంభావించు.

సు:—రాజపుత్రియనుగ్రహమున్న లభింపరానిదెద్ది? (అని సెలవు గైకొని నిష్క్రమించును.)

(రుక్మిణియు చెలులతో నిష్క్రమించును.)

ఇది తృ తీ యాం క ము.





శ్రీ ర స్తు.

# రు క్మి ణీ క ల్యా ణ ము.

## చతుర్థాంకము.

### వా స గృ హ ము.

[శ్రీకృష్ణుఁడు. ఆతని మిత్రుఁడు లలితుఁడు.]

లలి:—కృష్ణా! నేత్రము లెఱ్ఱవాఱియున్న వేమి?

కృ:—కార్యాంతరాలోచన నిమగ్నుఁడనగుట రాత్రి నిద్రచాలినది కాదు.

లలి:—అంత విచారింపఁదగిన యసాధ్య కార్య మెద్దియో యానతిచ్చిన నేను నిముసములో దాని సాధించి తమ యమోఘానుగ్రహమునకుఁ బాత్రమ నయ్యెదను.

కృ:—భక్షించుటకు వంటకములుగావు.

లలి:—పరిహాసించుచున్నవారు. సమర్థులగు తమ్మాశ్రయించి యిన్నిదినములనుండి కాలము గడుపుచున్న నాకు సాధింపరాని కార్యము గల్గునే.

కృ:—గాదెక్రింది యెలుకవలె సదా భక్ష్యముల మెసవుచుఁ గండగట్టి బలిసితివిగాన నట్లనుచున్నాఁడవు.

లలి:—నిజము. కావుననే యది నన్నుఁ బ్రేమించునో లేదో యది నన్ను వరించునో లేదోయని యనిశము ధ్యానించుచుందును.

కృ:—అంతర మెఱింగి ప్రసంగించుము.

లలి:—పరిహాసమునకై ప్రసంగించు భావనయ్యాపైనా మీకోపము. సదా మిమ్ము వినోదింపఁజేయుటయేగదా నా కృత్యము. కాకున్న నాకీ పదవియేల?

కృ:—సభలోనైన నీవిట్లు ప్రసంగింపవలసినవాఁడవే గదా! భావ చదువుకొనెనుగాని బుద్ధి మునుపటిదే యన్నట్లు నీ కీ ఛాంద సము వదలకున్నది.

లలి:—సభలో నెప్పుడైనఁ దప్పుగఁ బల్కితినా? ఇపుడుమాత్ర మే నాడిన తప్పుమాటయేమి?

కృ:—స్త్రీలోలుఁడనను భావము ప్రకటించితివిగదా!

లలి:—అట్లంటినా?

కృ:—అది నన్నుఁ బ్రేమించునో లేదో యది నన్ను వరించునోలేదో యని సదా ధ్యానించుచుందునని యంటివిగాదా!

లలి:—కృష్ణా! నిజమాడిన నిష్ఠురముగాని నీవు రుక్మిణిని బలాత్కార ముగఁ బరిగ్రహింపఁ దలంచుచుంటివా లేదా?

కృ:—నే నెపుడును దలఁపలేదు. తలంపఁబనిలేదు.

లలి:—నాఁటి యుద్యానవ్యవహారమును నేను మఱచితి ననుకొంటివి గాఁబోలు.

కృ:—అదేమి? నేను సర్వమును మఱచితిని.

లలి:—కృష్ణా! నీవదృష్టవంతుఁడవు. నీకంటెఁబడిన యాఁడుది నిన్నుఁ గోరకమానదు. నీవును దానినెట్లోని బొందక విడువవు. నీ యం దెట్టిసమ్మోహనశక్తి సజుఁడు గూర్చియుండెనో?

కృ:—ఏల యట్లనుచున్నాఁడవు.

లలి:—

ఉ. ముసిముసినవ్వులొల్కఁ గడుఁ ముచ్చటతోడుత నోరచూపులన్
విసరితి గన్నెమీఁద లలి! వేఁడి యెఱింగితి తన్మనోగతం

బసదృశరాగలక్షణము♦లప్పుడు నీముఖమందుఁ దోఁచె నా
యొసపరిబాగులాడి చన ♦ నొత్తితె నీ హొయలంత మాధవా.

నేనెంతఛాందసుఁడనైనను నామాత్రము తెలియదా!

కృ:—పురుషునకు రాగముగల్గినఁ బ్రయోజనమేమి? ఆఁడుది యందుల కనుకూలించినఁగదా సఫలమగును.

లలి:—ఆ హరిణాక్షియాశయమునుగూడఁ గనుఁగొంటిని.

కృ:—ఎట్లు?

ల:-ఉ. కలికి మొగంబు వంచియు నె♦గాదిగఁగాంచుట లేఁతనవ్వు వె
న్నెలలొలయంగఁ బల్కుట య♦నిందిత గాత్రవిలాససంపదల్
వలిపెము చక్కదిద్దెడు నె♦వంబునఁ జూపుట వీనులొగ్గి నీ
పలుకుల వింటఁ బోవుచు నె♦వం బిడి చూచుట తెల్పె రాగముల్

మఱియు.

తే. గీ. పెల్లుగా మోమునం గ్రమ్ము♦ స్వేదజలముఁ
బైఁటకొన నొత్తికొనుట కం♦పమును జెలుల
మూఁపులను బట్టుకొని నిల్చి ♦ యూఁపుకొనుట
త్వద్విషయకానురాగంబుఁ ♦ బయటఁబెట్టె.

కృ:—యువతియొనర్చు ప్రతిచేష్ట నాత్మపరముగా భావించికొనుట కాముకునకు సహజము. మఱియుఁ దరుణీతరుణు లొక్కచోటునఁ గార్యవశమునఁ గలిసినను నప్పటి వారిచేష్టలం గాంచి యనురక్తులుగ ననుమానించుట లోకపరిపాటి.

లలి:—కృష్ణా! మఱుఁగుపఱుప యత్నింపకుము. ఆ రామామణి యందు నీమది తవిలె. బాహ్యచిహ్నములేగదా పై వారికి ననుమాన కారణములగును.

ఉ. తనువుకృశించె నంగముల♦తళ్కుతొలంగె నెలుంగు కార్శ్యమున్
గనె మొగమందుఁ దోఁపదు వి♦కాసము తొల్లిఁటియట్లుమిత్రులన్

గని చనవొప్పఁ బల్కు విం కాసపుఁజూపు లెసంగె నక్కటా
తనుపవు బంధువర్గము విదర్భకుఁబోయిననాఁటినుండియున్.

కృ:—ప్రియురాణవుఁబడలిక నట్లుంటి ననుకొనరాదా? శరీర మస్వస్థముగనుంట నట్లుంటినని సంభావింప రాదా? మఱియుఁ బర పురుషదర్శనమెఱుంగని యా బాల క్రొత్తవానింజూచి భీతి నట్లు వర్తించెననుట సరసముగదా!

లలి:—నే నేమనుకొందునోయని యట్లనుచున్నాఁడవు. నీవైఖరి నంతయు నేఁ గనిపెట్టితి. ఇంక నూరకొనుము.

కృ:—ఆ వైఖరి యేమి?

లలి:—వైఖరిఁ బూసగుచ్చినట్లు తప్పక చెప్పితిఁగదా! మఱియు నొకనాఁడు విదర్భనుండి యిలు సేరినపిదప నీవొనర్చిన ప్రసంగమును జ్ఞప్తికిఁ దెచ్చికొమ్మ.

కృ:—అదేమి?

లలి:—రుక్మి తనచెల్లెలును శిశుపాలునకీయ సంకల్పించినవాఁడనియు భీష్మకుఁడును జేఁతగాక సుతునిసంకల్పమునె సతీసుతల కిష్టము లేకున్నను నెఱవేర్ప సిద్ధముగా నున్నవాఁడనియు రుక్మిణిమాత్రము నన్నే వరింపఁగోరుచున్నదనియుఁ గాన నన్ను గోరు నాయబలను నేను బలాత్కారముగఁగొనివచ్చి పరిగ్రహింపఁ దలంచువాఁడననియును బ్రసంగించితివిగాదే.

కృ:—ఆనాఁటిమాట యీ నాఁ డెత్తి కనులెఱ్ఱవగుటకును, వాడియుండుటకును దానిం గారణముగ ముడివెట్టుచుంటివా?

లలి:—మఱియు శిశుపాలుఁ డిందు విఘ్నకారియగుట యేగతినేని వాని పొగరడంచి కన్యం గొనివత్తునంటివా లేదా?

కృ:—ఆ! నిజము. రుక్మిణిం దనకీయకున్న జరాసంధాదిసహాయుండనై భీష్మకు నెదిరించి కన్యం గొందునని వార్త నాతఁ డంపుట ధర్మ్యమే. అనురక్తనందఁగోరుట సముచితము. మఱియుఁ

కన్యాజనము లోనంగినఁ బొందుట తగవు. కాని భయపెట్టి పొందఁగోరుట యర్థ్వామే.

తే. గీ. రాణి ననురక్తఁగానట్టి ♦ రమణిపొందు
కోడి(త్రాఁచును మెడఁగట్టి ♦ కొనుటగాదె
కోరి మెడ నురి తవిలించి ♦ కొనుటగాదె
కొఱవితోడను దలఁగోకి ♦ కొనుటగాదె.

మఱియు.

తే. గీ. పుట్టుమిత్రము మేనత్త ♦ పుత్రుఁడగుట
శతము నపరాధముల నేను ♦ సైతునఁటి
నదియ సందుగఁగొని నన్ను ♦ బెదరఁజేయుఁ
జేప చూపఁగవలె నింకఁ ♦ జేదిపతికి.

లలి:—కృష్ణా! వానియుబును నీకేల? నీకారామపై మక్కువలేదు గదా!

కృ:—నన్నుగోరు నా యబలను, జేతగానివానిరీతి నుపేక్షింప నా మనసొప్పకున్నది. మఱియు ననాథస్త్రీరక్షణ మవశ్యకార్య మందురుగాదే! కాన వాని బారినుండి నామెం బాపి యామె కిష్టమైన గ్రహింతును. లేకున్న నామెకిష్టమైనవానింగూర్చి రక్షింతును.

లలి:—ఇంక నీరాగము తేటతెల్లమైనది. నీయిష్టమెట్లో యట్లు ప్రవర్తింపుము.

కృ:—అట్లనుము. ఆ జగన్మోహిని నేవాఁడు పొందఁగోరఁడు. ఆమె యపూర్వ సౌందర్యము నీ డెందము నంది యానందముం గూర్పలేదే.

సీ. కప్పైన వకాళ్రల ♦ కంబుల నునువంక
పాపటనుం గఱి ♦ వంక బొమల

నలికంపుఁ గస్తూరి ♦ తిలకంబుఁ గెంపుల
కమ్మలతో నొప్పు ♦ కర్ణయుగళిఁ
గదలని వెడఁదయౌ ♦ కన్నుదోయిని మంద
హాసాంచితంబునౌ ♦ యధరపుటము
నీలాలకవ్యాప్త ♦ ఫాలప్రదేశంబు
నరుణాంకములఁ జెక్కు ♦ టద్దములను

తే. గీ. వ-డుతమ్ముల పాకులఁ బరిహసించు
నింతి తనుకాంతిఁ దిలకించి ♦ తే వయస్య!
దారగా దానిఁబొందఁగఁ ♦ దలఁపఁ డెవఁడు
కాముఁడైనను ధిక్కృత ♦ కాముఁడైన.

తే. గీ. పఱగు పలుచని తెల్లని ♦ పరికిణిపయి
కాఁత వలెవాటు వేసిన ♦ కావి వలిప
మింతి తనుకాంతి కెంతటి ♦ వింతచెలువ
మిచ్చుచున్నదో! గంటివే ♦ యిష్టసఖుఁడ.

లలి:—శిశుపాలుఁడును నందులకే యీమెను గోరినవాఁడు. నీవు గోరుట యుచితమును నాతఁడుగోరుట యనుచితమునా?

కృ:—అనురక్తగా నరసి నే వాంఛించితిని. అననురక్తయని తెలిసియును, నాతఁ డామె నభిలషించి యధర్మముగా వర్తిలుట యనుచితముగాదె. కానున్నది గాకపోదు. ఇంక నా దుష్టునిమాట తలపెట్టకుము.

లలి:—దానికేమికాని యక్కాంతకాంతిరూపమునెంతగ నీహృదయ ఫలకమున భావించి చిత్రించికొంటివో. నే నుత్తరక్షణము ననే యీ రూపమును మఱచితిని. నీ కనుదమ్ములకా తేజము రవిరశ్మియై వికాస కారణమగుట నింతకు మఱుపవైతివి. తనకుఁ గానిదానిఁ దా విస్మరించుటయుఁ దనకగుదానిఁ దా స్మరించుచుంటయు సహజములు గదా!

కృ:—నిజము. మందుని డెందమున కాయుంద మమందానంద సంధాయకము గాఁజాలదు.

లలి:—పోనిమ్ము. నీవే తద్భావభావన నానంద మందుచుందుము. మట్టమధ్యాహ్నమయ్యె. బుభుక్ష మీరుచున్నది. ఇటు చూడుము.

ఉ. చిమచిమలాడు మేను చిఱు చెమ్మటఁ జీమలు కుట్టినట్లుగాఁ
గమలెడు నెండవేఁడిమి మొగంబుఁ బిపాస కడుం జనించెడుఁ
దమతమ కాళ్ళియంబులగు తావుల పీడక వేళ్ళలు నీడలున్
నిముసము నీదరిన్నిలువ నేర బుభుక్షయు హెచ్చె మాధవా!.

కృ:—నీకెప్పుడును భుక్తిమీఁద నేచింత.

లలి:—నీకెప్పుడును రక్తిపై నే చింత.

కృ:—వాగ్వాద మేల? మెసవుటకుఁ బద.

(అంత ద్వారపాలకుఁ డే తెంచి) "జయజయ యదుకులోద్ధారకా!" (అనును.)

కృ:—కుశలీ! మము నుతింపఁ గత మేమి?

కుశ:—విదర్భనుండి విప్రుండొకండు వచ్చి భవద్దర్శనార్థము వేగిర పడుచున్నవాఁడు. (అని ప్రణామపూర్వకముగా మనవి చేయును.)

కృ:—శీఘ్రముగా తనిఁ బ్రవేశపెట్టుము.
(కుశలి తోడ్కొనివచ్చి సన్నిధినినిల్పి సెలవంది పోవును.)

కృ:—(ఆసనము దిగి ప్రాంజలియై)

శ్లో॥ మహావిష్ణుస్వరూపాయ మహీసురవరాయ తే।
నమస్కరోమి కృష్ణోహం దాసస్తే పృథివీసుర॥

సు:—శీఘ్రమేవ చింతిత మనోరథ సిద్ధిరస్తు. కల్యాణావాప్తిరస్తు. (అని దీవించును.)

కృ:—ఎచ్చటినుండి యెచ్చటికిఁబోవుచు నిచ్చటి కేఁగుదెంచినారు. నేడు మీరాక నాగృహము పవిత్రమయ్యె! నేధన్యుఁడనైతిని. మీరాకకుఁ గారణమేమైయుండునో యానతిచ్చిన మీ భృత్యుఁడు మీవాంఛితము నీడేర్ప సంసిద్ధుఁడై యున్నవాఁడు.

సు:—కృష్ణా! ఆర్తశరణ్యా! విదర్భనుండి రుక్మిణి పంప వచ్చినవాఁడను. మఱియు భగవత్స్వరూపులరగు మిమ్ముల దర్శించిన నాయఘరాసులడంగుననుకోర్కి నిటకేతెంచితిని.

కృ:—భీష్మకభూపాలుఁడు నిరామయుండే? రాకుమారులెల్లరు సుఖముగా నున్నారే? సుశీల రుక్మిణికిఁ గుశలమే?

సు:—చిత్తము.

కృ:—ఇలానిలింపా! శీఘ్రిమ రుక్మిణీసందేశమునువిన్పించి వీనులకు విందొనర్పుము.

సు:—

ఉ. ఆర్తశరణ్యా! భక్తసుల♦భా! హరి! కృష్ణ! దయాంతరంగ! నా
భర్తవునీవ దేవయని ♦ బాల్యమునుండియు నమ్మియుండ నా
ధూర్తుఁడు చైద్యుఁడయ్యె పతి♦ తోయజలోచనగావుమంచు నా
యార్త యనాథ రుక్మిణి కృ♦తాంజలియై తగ విన్నవించెడుణ్.

మఱియు నామె నామాటగా విన్నవింపుమని చెప్పిన యంశముల నవధరింపుము.

సీ. అన్న నిర్దయుఁడయి♦నన్నుఁగట్టుటకెంచెఁ
జేదీశునకు వేగ ♦ జీవితేశ
బాల్యమ్మునుండి నేఁ ♦ బ్రాణేశుఁగా నిన్నె
నెమ్మనంబున నెఱ ♦ నమ్మియుంటి
వర్తిల్లు నెల్లి వి♦వాహంబు నామీఁద
శిశుపాలు సామ్మాదు ♦ శిక్షితారి

మానభంగముదోఁపఁ • బ్రాణంబువీడిన
'సుదతీమణులఁ దాము • చూడలేదొ?

తే. గీ. గర్వసంభన్నవాక్యంబు•గాఁ దలంప
కయ్య నను వేగఁబ్రోవ రా•వయ్య కృష్ణ
యని మనవిసేయుమనెను రు•క్మిణి సుశీల
యా భవదధీనజీవిత • యా యనాథ.

మఱియు భీష్మకుండును తమకిదె శుభలేఖ వ్రాసి యంపు కొనెను. చిత్తగింపుఁడు. (అని చేతికందిచ్చును.)

కృః—మీరు రాజుగారితోఁగూడఁ జెప్పివచ్చితిరా?

సుః—రుక్మిణి శ్రీకృష్ణునకు నా సందేశమును విన్నవించి యాతనిం దోడితెండని ననుఁ బ్రార్థించినపిదప సెలవుగైకొన మహారాజు కడకేఁగితిని. నే నాయంశమును మనవిసేయకమున్నె భూపతి ద్వారకకుఁబోయి శ్రీకృష్ణునకీ శుభలేఖనుసమర్పించి యాతనిం దోడుకొనిరండని యాజ్ఞాపించెను. కానఁ గార్యద్వయ సాధనభారము నాపైఁబడెను.

కృః—(శుభలేఖను బరికించి కోపముతో)

శా. శిక్షింతుఙ్ శిశుపాల మాగధ రిపు•శ్రేణిఙ్ హరుం డడ్డినన్
రక్షింతుఙ్ శరణాగత న్రమణి దు•ర్వారావదం బాపి యే
శాక్షిం గొందును రాక్షసంబున నృపుల్•హాయంచు వీక్షింప నేఁ
డక్షీణంపుబలంబుఁజూప సమయం• బాయెన్బ్రతీక్షింపఁగాఙ్.

(శాంతించి) మఱియు శరణాగత రమణీరక్షణము నావిధియై యున్నది. అట్లగుట సత్వరముగనే శరణాగతను సంరక్షింప వచ్చెదనని రుక్మిణితోఁ జెప్పుఁడు. మఱియుఁ శ్రీకృష్ణుఁడు శుభలేఖం జూచి చాల సంతసించెననియు శుభముహూర్త దినమునకుఁ దప్పక వత్తుననెననియు మీరాజుతో విన్నవింపుఁడు.

సు:—శ్రీకృష్ణా! సనకాదిమునిచంద్రులకు సైత మలభ్యమగు మీ దర్శనముఁ జేసి ధూతాఘుఁడనైతిని. నాజన్మము సఫల మయ్యెను సెలవిమ్ము. పోయివచ్చెదను.

కృ:—మహీసురపుంగవా! ఈ భూషణాంబరములఁ బరిగ్రహించి నను ధన్యునిఁజేయుఁడు. (అని భృత్యుఁడుకొనివచ్చిన భూష ణాంబరములఁ గృష్ణుఁడందికొని బ్రాహ్మణున కిచ్చి) ముదు సలివి. నడిచి పోఁజాలవు. నేనును నీవును గలిసియేపోవుదము. ఈపూట యాగుము.

సు:—(పరిగ్రహించి సవినయముగా) రుక్మిణి నాకై యెదురుచూచు చుండును. నేనాలస్యముసేసిన నామెకుఁ బ్రాణభంగమువాటి ల్లును.

కృ:—ఏమియు నమంగళము జరుగఁబోదు ఇదె ప్రయాణ సన్నా హము సేయింతు. లలితా! ఇంక సందేహమేల? రాక్షసమున రామను బరిగ్రహింపఁబోదము. పయనముకమ్ము. వలయు సామగ్రి నాయత్తపఱుప భృత్యుల కాన యొసంగుము.

లలి:—అట్లే చేసెద. (అని యనుమతుండై పోవును. కృష్ణుఁడును, సుదర్శన సహితుఁడై నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.





శ్రీరస్తు.

# రుక్మిణీ కల్యాణము.

## పంచమాంకము.

### కన్యాంతఃపురము.

[కల్యాణమంగళవేషముతోఁడి రుక్మిణి, అరవింద, కల్యాణి.]

రు:—(చెలులతో)

సీ. పోవునే తిన్నఁగా ♦ భూసురశ్రేష్ఠుండు
విన్నవించునె నాదు ♦ విన్నపంబు
తెచ్చునే హరిని భూ♦దివిజుండు హరి యింక
వచ్చునే నను బ్రోవ ♦ వైరిఁ దోలి
జాయఁగా నన్నేల ♦ సమ్మతిం జూపునే
కలుగునే నాకంత ♦ గౌరవంబు
తలఁచునే తప్పుగా ♦ నలినాక్షుఁ డిది విని
మన్నించునే నన్ను ♦ మానవతిఁగ

తే. గీ. రాజులెల్లరు వేడ్కతో ♦ రథ గజాది
వాహనారూఢులై యదె ♦ వచ్చుచుండ్రి
భూసురుం డింత తడవేల♦చేసె నొక్కొ
హరియు రాఁడయ్యె నేలొకో♦పురమునకును.

క:—గడియకో గడియకో వచ్చునేమో?

రు:-సీ. ద్వారక చేరెనో ♦ దారిలో డస్సెనో
ధరణీసురుం డేల ♦ తడవు సేయు

జలజాక్షుదర్శింప ♦ సమయమయ్యెనో లేదో
మృష్టాన్నతృప్తుఁడై ♦ కృష్ణునింట
సుఖముగానుండెనో ♦ శుభముహూర్తదినంబు
మఱచెనో కాకున్న ♦ మసలునోకొ
చనుదెంచునో నేఁడు ♦ జలజాక్షసహితుఁడై
గౌరి యీశ్వరి కృపఁ ♦ గావకున్న

తే. గీ. తండ్రివార్తను బంపమి ♦ దైత్యభేది
యల్గి రాకుండునో వివా♦హమున కకట
లగ్నమాసన్నమయ్యె ని♦లానిలింపుఁ
డింకరాఁడయ్యె నాకింక ♦ నెవరుదిక్కు.

క:—విచారింపకుము. భవానీదయవలన నవశ్యము బ్రాహ్మణుఁడు శ్రీకృష్ణసమేతుండై రాఁగలఁడు.

రు:—

శా. లేఁడో శ్రీహరి యింట భక్తులను బా♦లింపంగ నెందేని యు
న్నాఁడో పాఱునిపల్కులెక్కఁగొనకు♦న్నాఁడో ననుం బ్రోవఁ దా
రాఁడో విప్రుఁడు నేర్పునోర్మిఁదగవా♦ర్తం దెల్పఁగా శక్తుఁడుం
గాఁడో వచ్చుచునున్నవాఁడొ హరితోఁ♦ గానున్న దేమో శివా!.

క:—ఆర్తరక్షణపరాయణుఁ డేతెంచక మానునా?

(అంత నొకతె వచ్చి రుక్మిణికిఁ దల్లి రాకం దెల్పి యనుజ్ఞనంది ప్రవేశ మొసంగి పోవును.)

(రుక్మిణి తల్లియడుగుల కెరఁగును.)

సతి:—భజస్వవాంఛితఫలం భవానీదయయాసుతే।
శ్రీనివాసం పతిం కృత్వాపాయాత్త్వాం కులదేవతా॥
(అని శిరసు మూర్కొని ముద్దాడును.)

రు:—జనని! రాత్రియందే లగ్నమా?

సతి:— ఆ! శిశుపాలుఁడు జరాసంధాది మిత్రులతో నేతెంచె. మీయన్న వారియదుగులకు మడుగులొత్తుచున్నవాఁడు. అదె గౌరీపూజకేగ సర్వము సంసిద్ధము సేయఁబడినది. నీతోడ రా సేనలవె కట్టాయితమై నిల్చియున్నవి. నిన్నలంకరించి యిప్పుడే యనుపవలెనని మీ నాన్నగా రానతి యొసంగిరి. అందులకే యే నిపుడేతెంచితిని,

రు:—(మోము ముడిచికొని) తల్లీ! యాచైద్యునకే యేను బరిచర్య చేయవలెనా? ఆ యదుసింహుని పాదసరోజముల భజించు భాగ్యము నాకు లేదు గాఁబోలు. తొలిపుట్టువున నొండె యంతకుఁ బూర్వపుఁబుట్టువుల నొండె నట్టి భాగ్యమందఁగల పుణ్యలేశముంజేసికొనియుండ లేదుగాఁబోలు. తల్లీ! ఆచైద్యునే సేవింపవలసివచ్చిన నా యాస నీవు వదలుకొనవలసినదే. (అని కన్నీరు నించును.)

సతి:— సీ. పసుపుఁజెక్కుల నెఱ్ఱ • బొట్టెలు తేరంగఁ
గన్నీరునించు ని • న్గాంచఁజాల
కాటుక కన్నీటఁ • గట్టుచీరకొనంత
కలఁగాగఁ గుంద ని • న్గాంచఁజాల
అతివేల బాష్పపూ • ర్ణారుణంబై కన్నుఁ
గవవాయ వందు ని • న్గాంచఁజాల
శుష్కించి నెమ్మోము • శుక్లపత్రిపదిందు
గతినొంద వనరు ని • న్గాంచఁజాల
తే. గీ. చిక్కి చెక్కులు చెలువేద • సిరి తలంగి
యధరబింబంబు నవయ దే • హంబుఁ బాండి
మాతిశయమొంద వలవంత నందు నిన్నుఁ
గూఁతురా చూచుచేరీతి • సుఖముఁ గందు.

భవానియుఁ గులదైవములును నిన్నుఁదప్పక బరిరక్షింతురు. వలవంత యావంత నందకుము.

రు:— తే.గీ. శ్రీనివాసుఁడు భూజాని♦బృందమందుఁ
గానరాఁడేని మరల న♦న్గాంచలేవు.
కూఁతుఁ గాంచంగలేదను♦కొనుము జనని
తీఱెను ఋణానుబంధమ్ము ♦ దెలియు మింత.

మఱియు.

సీ. పుత్రులేవు రాగాని ♦ పుత్రిక పుట్టనే
లేదనుకొనుము త♦ల్లీ మనమున
కలయందునేని న♦స్దలఁచి కంటను దడి
పెట్టకుమమ్మరో ♦ యొట్టు సుమ్మ
పరకీయ తనదారిఁ♦బట్టి పోయె నిఁకేల
యని యెద శిలఁజేసి♦కొనుము తల్లి
కులవధూధర్మంబుఁ ♦ దొలఁగిన పాంసుల
చనిన నేమనిచింతఁ ♦ గనకుమమ్మ

తే. గీ. పెద్దకూతుఁరు నీకు మా♦పెద్దవదిన
చిన్నవదినెలు నా చెలుల్ ♦ చిన్నకూఁతు
లంబ! వాత్సల్యమున వారి♦నరసికొంచు
రుక్మిణీశబ్దమును దల్లి♦గో మఱువవె.

సతి:— పట్టీ! నా పాడుచెవుల నిట్టిమాట లెట్లువిందు. అమంగళము ప్రతిహతమగుఁగాక. (అనునప్పటి కొకతె సుదర్శనాగమనమును నివేదించి సతీరుక్మిణులసమ్మతిని బ్రవేశపెట్టిపోవును.)

[ సుదర్శన ప్రవేశము. ]

రు:—(అవనతముఖయై) ఓ పరోపకార పారీణా! మజ్జీవనౌషధా! రుక్మిణి యిదే సాష్టాంగ మాచరించుచున్నది.

సు:— కల్యాణీ! కార్యము సఫలమైనది.

రు!— మహీసురరత్నమా! మాధవుఁడేమనె! మర్యాదచేసెనే!

సు:- ఉ. మెచ్చి భవద్గుణంబుల న◆మేయధనంబునొసంగెనాకుఁ దా
వచ్చెను జక్రి పేర్మి శిశు◆పాల జరాసుతులం జయించి నిన్
హెచ్చగు వైభవంబున గ్ర◆హించు సురాసురులడ్డమైన నా
దిచ్చలకంటె యద్దినను ◆ జిందఱవందఱచేయుఁ గన్యకా.

బాలా! అమూల్యవస్త్రాభరణముల నొసంగి ననుగౌరవించెను. ఆతండును నిన్నే యనుకరించుచున్నవాఁడు. కలిసి వచ్చితిమి. ఆతఁడు బాహ్యోద్యానదేశమున నున్నవాఁడు.

రు:—ఆర్యా! మీ యనుగ్రహమువలన నా కోర్కె సఫలమైనది. మీ ఋణము నే నేమిచ్చి తీర్పఁగలను. ఇదె దోసిలియొగ్గి భక్తితో నమస్కరించుదాన.

సు:—తల్లీ! నీమూలమున నా దారిద్ర్యము విచ్ఛిన్నమైనది. నా యఘరాసు లంతరించినవి. సెలవిమ్ము. పోయివత్తును.

రు:—చిత్తము. దయయుంచుఁడు. (సుదర్శనుఁడు నిష్క్రమించును)

[ తెరలో ]

"ఈనాఁటిరేయి రాకొమరితకుఁ బెండ్లి. పురజనులు యథేచ్ఛాహార విహారముల ననుభవించి యానందింపుఁడు."

(అని రాజాజ్ఞ చాటఁబడును.)

రు:—గౌరి! నా పాలికీరాత్రి యెట్టిదిగఁ జేయుదువో? తల్లి! పోయి వత్తు ననుజ్ఞయిమ్ము.

సతి:—అమ్మా! ముహూర్తము మించును. మెల్లగ నడువుము.

రు:— (సఖీ సమేతముగ నేగ సిద్ధపడి దీనముగ)

సీ. సెలవీయరే సర్వ◆కుల దైవతములార
యంపరే దీవించి ◆ యగ్నులార
పంపరే ప్రియ వన◆స్పతులార మన్నించి
యనుపరే లతకూన◆లార కూర్మి

పుచ్చరే మన్నించి ♦ పూగవృక్షములార
వీడుకొల్పరె మేటి ♦ మేడలార
వనుపరే కృతకప ♦ ర్వతములారా ప్రీతి
నమ్మతిం జూపరే ♦ నరసులార

తే. గీ. ఓ విదర్భేశ రాజ్యల ♦ క్ష్మివిధేయు
రాల దీవించి పంపవే ♦ రాజధాని
సెలవొసంగరె చతురంగ ♦ బలములార!
చూపరే రుక్మిణికిఁ ద్రోవ ♦ యేపుమీఱ.

(అని తల్లియడుగులఁబడి నమస్కరించును.)

సఖి:—దుష్టదానవహంత్రి ♦ తొలఁగించి విఘ్నముల్
గారాబువట్టిని ♦ న్గాచుఁగాత
సర్వమంగళ శుభ ♦ జాలంబు సమకూర్చి
పుత్రికా దయమీఱఁ ♦ బ్రోచుఁగాత
పార్వతి వాంఛిత ♦ ఫలముల దయచేసి
యుత్తమశీల ని ♦ న్నోమఁగాత
గిరిరాజపుత్రి శ్రీ ♦ కృష్ణునితోఁగూర్చి
యింతిచింతలఁ దొలఁ ♦ గించుఁగాత

తే. గీ. నాతి తోఁచెడు శుభ శకు ♦ నములు నిజము
కోరుకొన్నట్టి నాథునిఁ ♦ గూడఁగలవు
భక్తరక్షణ దాక్షిణ్య ♦ సక్త గిరిజ
భక్తురాలిని నిన్నుఁ గా ♦ పాడకున్న.

అదె పార్వతి పూర్ణకలశములఁ జేతఁబూని యేతెంచుచున్నది.
పోయిరమ్మా. (అని ముద్దాడి యనిపి నిష్క్రమించును.)

(చెలులతోడ రుక్మిణియుఁ బోవును.)

ఇది పంచమాంకము.





శ్రీ రస్తు.

# రుక్మిణీ కల్యాణము.

## షష్ఠాంకము.

### భవాన్యాలయము.

[ రుక్మిణి, చెలికత్తెలు. ]

రు:—శ్రీహరి నిక్కముగ వచ్చునే.

అర:—బ్రాహ్మణుఁ డెన్నఁడేని యసత్యము పల్కునే.

రు:—హరి నన్నుఁ బరిగ్రహించునే.

అర:—మహాత్ము లవితథ వచనులని యెఱుంగవే.

రు:—(ధ్యానము నభినయించి)

సీ. పితసేయు పతినింద ♦ వినలేక ప్రాణము
లొ్వడిచినసతి! పతి♦నిడి మనుపవె
నవసి తపంబున ♦ ధవుగ నీశునిఁ బడ
సిన యపర్ణా! మొఱవిని యరయవె
హరునర్ధదేహంబు♦నంటి పాయకయున్న
రుద్రాణి! సౌభాగ్య♦భద్రి మీరవె
కాసరాసురుఁ దున్ని ♦ వాసిఁ గాంచిన కాళి!
యహితాళినడఁచి ద♦యం దనుపవె

తే. గీ. కృష్ణుసందర్శనమిడి ర♦క్షింపుమమ్మ
బాలగోపాలుఁ గూర్చి కా♦పాడుమమ్మ

వాంఛితఫలమ్మొసఁగి చింతఁ ♦ బాపుమమ్మ
సర్వమంగళ! శుభములొ♦సంగుమమ్మ.

(గౌరీపూజ చేసి)

ఉ. అమ్మ! భవాని! గౌరి! మది ♦ నార్తశరణ్యవటంచు నే సదా
నమ్మితినమ్మ నిన్ను హరి♦నాథునిగా సమకూర్పవమ్మ మా
యమ్మ నుతింతునమ్మ కరు♦ణార్ద్రమనస్కవుగాఁ గదమ్మ నిన్
నమ్మినవారివాంఛితము ♦ నాశముగాదుగదమ్మ యీశ్వరీ.

ఉ. అయ్యొ దయావిహీనమతి ♦ యగ్రజుఁ డాతనిమాట దాఁటలే
కయ్యయు నమ్మయుం గరిను♦లై నను జైద్యునకీయ నెంచినా
రయ్యయొ లేరుదిక్కెవరు ♦ నంబ! దయామయి! నీవుదప్ప నా
యయ్యయు నమ్మవీవ యగ♦జా హరి నాథునిజేసి బ్రోవవే.

(ఇట్లు ప్రార్థించి సాష్టాంగ నమస్కారమాచరించి మఱలును. రాజులు బారుదీర్చి యిరుపంక్తులనిల్చి సవిలాసముగఁ గాంచుచుందురు.)

రు.—సఖీ! కల్యాణి! శ్రీకృష్ణుఁడు గానరాఁడయ్యెను. ఇంకఁ బ్రాణముల విడువవలసిన దేనా?

క.—లజ్జాభరమున మోము వాంచియుంట నీవాతని దిలకింపవైతివి. ఈ భవాన్యాలయమున కనతిదూరములో నాతఁడు బలభద్ర పరివారసమేతుండై నిల్చియున్నవాఁడు. ఆ జగన్మోహను నొక్క యరఘడియలో నీవు చూడఁగలవు.

రు:—శ్రీకృష్ణుఁడాతఁడని నీవెట్లు నిర్ధారణచేయఁగలవు.

క:—అలనాఁడు పూఁదోఁటం గాంచితిమిగదా! ఇంతియగాక యానాఁడు నీవుచేఁబూనిన చిత్రపటమునం దేయాకారము చిత్రింపఁబడియున్నదో యదే యాకృతి నచటఁజూచి శ్రీకృష్ణుఁడని సిద్ధాంతీకరింపఁగల్గితిని. మఱియు హలమును భుజముపైఁ బూనిన హలాయుధుని సాహచర్యమున నాతనిఁ గృష్ణునిగా

నూహించితిని. అతఁడు భవాన్యాలయములో నీవు ప్రవే
శించునంతవఱకు నిన్నుఁ జూచుచునేయున్నవాఁడు.

రు:—యుద్ధసన్నద్ధుండైనట్లుండెనా? లేక ప్రసన్నుండై యుండెనా?

అ:—అమ్మా! మందహాసాలంకృతంబైనను మోము కోమలారుణ
త్వమును వహించుచున్నది. సర్వాభరణ భూషితాంగుఁడై
శిఖిపింఛధారియై నడుముఁగట్టి కీవితో నిల్చియున్నవాఁడు.
ప్రసన్నుండనుటకుఁగాని యప్రసన్నుండనుటకుఁగాని వలను
పడదు. మహాత్ముల యంతఃకరణవృత్తులగ్రహింప నేరితరము.

రు:—సఖీ! ఎట్లాతని సంస్పర్శమును సహింతును? నేను సఖీ! హీ
ననై యెట్లుపోదును? తలంచుకొనిన మేను పరవశమగు
చున్నది. సఖియలారా! దయయుంచుఁడు.

అ:—వెఱపేల. రమ్మా.

(రుక్మిణి క్రీగంటిచూపుల రాజలోకము నాలోకించుచుఁ
బోవుచుండును)

అ:—(చేసన్నసేసి) అదె గోపీమనోహరుఁడు. (చూపును.)

(రుక్మిణి భయకంపితగాత్రియై గడగడవణంకుచు కృష్ణునకు
సమీపముగాఁ బోవుచుండును. హఠాత్తుగా కృష్ణుఁడు రుక్మిణి నెత్తి
కొని తెరలోని కరుగును. చెలులు, రాజులు నిల్చియుందురు.)

కృ:— తెరలో]

శా. ఓరాజాధమ! చైద్య! మాగధ! సమస్తోర్వీశ బృందంబులో
నీరామామణి రుక్మిణీసతిని నే నిల్లాలిగాఁగొంటి మీ
సారంబియ్యెడఁజూపి యోర్చి వను నీసాధ్వీమణిన్గొండు లే
దా రాజత్వమువీడి పాహియని హస్తద్వంద్వమునోడ్డుఁడీ.

శి:—

సీ. అలమాగధునకోడి యిల నిల్వఁజాలక
జలధి ద్వారక నెలకొలుపలేదె?

బాలుఁడవని ప్రేమ ♦ లాలనసేయు దు
  ష్కార్యంబనక స్త్రీని ♦ జంపలేదె?
లలనలతోఁగూడి ♦ జలకేళిఁ దేలి త
  త్కుల సుశీలము లేటఁ♦గలుపలేదె?
మేనమామయని యే♦మేనియు నెంచక
  కూడుపెట్టినవానిఁ గూల్పలేదె?

తే. గీ. ఎఱుఁగమే నీ పరాక్రమ♦మిపుడు క్రొత్త
  స్తేయమున నీప్సితము గంట ♦ చిన్ననాఁటి
  నుండి నీ కలవడినది ♦ దుండగీడ
  పోకు మేని దెగఱ్చెదఁ ♦ జోర నిన్ను.

(అనుచు కోదండపాణియై జరాసంధాది రాజసహాయుఁడై శిశుపాలుఁడు ప్రవేశించును.)

కృ:—(చక్రపాణియై రభసమున నేతెంచి)

శా. ఓరీ దూరముగాఁ దొలంగి చని యీ♦యుద్యోగమున్వీడరా
  యేరా యూరక చక్రధార కెరయై♦దేలా వృథాలాపముల్
  పోరా మాగధుమాటలన్విఁనక పో♦పో నీకుఁ బోఁగాలమా
  యీ రామ న్విడిపింపనేరరు హరి♦శేంద్రాదులు న్నమ్మరా.

(అని వాఁడిశరముల నేయును. శరఘాతముల కోడి శిశుపాలుఁడు పాఱిపోవును.)

(పిదప రుక్మి ధనుర్ధరుఁడై ప్రవేశించి)

చ. నిలునిలు గోప పోకుమిఁక ♦ నే నుఱుమాడెద నిన్ను నాజిలోఁ
  వలఁ గులహీన క్షత్రియుఁడ♦వా నరివాఁడవ యేల నీవు మా
  చెలియల చోరవృత్తిఁగొని ♦ చెచ్చెరనేగెదు పెండ్లియాడ నీ
  తలయె తలంచిచూడ నది♦ధైర్యమె క్షాత్రమె గోపబాలకా.

(అనుచు శరజాలములఁ గృష్ణునిపై నేయును.)

(కృష్ణుఁ డాతని దీవ్రబాణములనేసి నొప్పించి మూర్ఛిల్లఁజేసి నిశితాసిచే శిఖం గోయ యత్నింపఁగా రుక్మిణి సఖులతో సత్వరముగ నేతెంచి యాతనిహస్తమును బట్టుకొని)

ఉ. జ్ఞాననిధు ల్మహామునులు♦సైతము మిమ్మెఱుంగనేర ర
జ్ఞానియు బాలుఁడెట్లు హరి♦చక్రి యెఱుంగు క్షమింపుఁడింక నా
ప్రాణసమానసోదరుని ♦ భంగముఁజూడఁగఁజాల జీవితే
శా నిను వేఁడుకొందునిఁక ♦ సైరణసేయవె భక్తవత్సలా.

(శ్రీకృష్ణుఁడు శాంతించును. చెలులు రుక్మిణిచెంతకేతెంచి యభినందింతురు.

(అంతట భీష్మకుఁడు సుదర్శనునితోడను బరివారముతోడను బ్రవేశించును. కృష్ణుఁడు సుదర్శనునకు నమస్కరించి కౌఁగలించికొనును. పిదప భీష్మకునకును మ్రొక్కును.

భీ:—

ఉ. శ్రీరమణీకళత్ర! సర♦సీరుహనేత్ర! సురేశమిత్ర! సం
సారలతా లవిత్ర! జన♦సన్నుతి పాత్ర! వినీలగాత్ర! శ్రీ
ధీర మనోజ్ఞ నేత్ర! వసుదేవ సుపుత్ర! నమోనమో దయా
నీరధి! నీదుభక్తుని వి♦నీతుని నన్ను ననుగ్రహింపవే.

ఉ. పాహి కుమారు భక్తజన♦వత్సల! కోపము సంహరింపవే
సాహసియయ్యె దుర్జనుల♦సంగతిఁజేసి క్షమింపు పుత్రిను
ద్వాహవిధిం గ్రహించి మము♦పంకజనాభ! తరింపఁజేయ ను
త్సాహముతోడ నాపురికి ♦ సన్నుత రాగదవయ్య రక్షకా!.

కృ:—పెద్దలగు మీరు నన్నింత వేఁడుకొననేల ? పాణిగ్రహణము గానేయైనది.ఇంక లౌకికపాణిగ్రహణము మీఁద మీకోర్కి ప్రకారము జరుగవచ్చును. ఈయదియేకాదు.మీ రేకార్యమును నెఱవేర్పుమనిన నాకార్యమునునెఱవేర్చి నా కృతజ్ఞతను గనుపఱుప సిద్ధముగానున్నాఁడను.

భీ:—అయిన మీ బావయలుక దీర్పుము. (అని చిఱునగవుతో ననును)

కృ:—

ఉ. ఎన్నఁడు నిట్టి సాహసపుఁ గృత్యము సేయకుమయ్య దుర్జనుల్
పన్నిన కృత్రిమోక్తిమయ వాగురలోఁ బడినట్టివాఁడవై
యెన్నఁడు వారిపొంతఁ జన కేమఱకుండుము సజ్జనాళితో
మన్ననఁ బొందు నార్యబుధ మాన్యుఁ డవౌనఁ బరానఁ జాలగా.

(అని కృష్ణుఁడు రుక్మిని కౌఁగలించును. రుక్మియు సంతోషాన్వితుఁడగును.)

భీ:—(మోమువాంచి చెలికత్తెలచెంతఁ జేరియున్న కూఁతును సమీపించి) అమ్మా! అంబికామోఘానుగ్రహమున నీప్సితముం గాంచితివి. మమ్ము తరింపఁ జేసితివి. (అనుచు దేవేరితోడ కృష్ణున కభిముఖముగ నిల్చి)

భీ:—శ్రీకృష్ణా! మమ్ము మావంశమును దరింపఁ జేసితివి. మా జన్మము సార్థకమయ్యెను. మేము ధన్యులమైతిమి.

కృ:—మామా! ఇంక నెయ్యదియైన మీకుఁ గోరవలసియున్న గోరుకొనుఁడు. నేనద్దానినిగూడ నెఱవేర్చి మీదయకుఁ బాత్రమవయ్యెదను.

భీ:—కోరఁదగిన దింకేమున్నది. అయిన నిట్లగునట్లనుగ్రహింపుము.

తే. గీ. భవ్యవిజ్ఞానజీవన ప్రదము కృతియె
వరకృతియె యాస్తికత నిల్పవలఁతి, గాన
లోకహితవృత్తులౌ కవిలోకమునకు
భూపతతి మేలుఁ గోరుచుఁ బ్రోచుఁగాత.

కృ:—అట్ల యవశ్యమగుఁగాక.

(అందఱును నిష్క్రమింతురు.)

మంగళం మహత్, శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

ఇది షష్ఠాంకము. సర్వము సమాప్తము.

—:o:—